# పల్లెటూరు

సాంస్కృతిక మాస పత్రిక

ఖర కార్తికము



సంపాదకుడు :

**దేవీప్రసాద్**

సంయుక్త సంపాదకుడు :

**రామచంద్రారెడ్డి**



**15 నవంబరు**
**1951**

సాలు చందా 6 రూ. విడి పత్రిక 8 అ.

# పల్లెటూరు

## సాంస్కృతిక మాసపత్రిక

### విషయానుక్రమణిక



ముఖ చిత్రము: గాంధీ దేవుడు

# పల్లెటూరు


## సాంస్కృతిక మాస పత్రిక

| సంపుటి ౧ | ఖర, కార్తీకమాసము | సంచిక ౧ |
|---|---|---|


## స్వవిషయము

భరత మాత సౌభాగ్యమునకు బంగారు పువ్వు పల్లెటూరు. ఇట్టి పల్లెటూళ్లు బంగారు పువ్వులుగా ప్రకాశించుచుండ భారతావని సస్యశ్యామల సౌందర్యరాశిగా నొప్పును. పాడిపంటలకు నిలయమై పట్టణాలకు కల్పతరువై మునులకు ఆశ్రియమై బుద్ధభగవానుని బౌద్ధవిహారములకు ఆటపట్టై నవరసముల చిప్పిలజేయు నల్లిక బిగి సొంపుగల కవుల కవితకు పూలతోటయై శాంతిస్వరూపుడగు గాంధి మహాత్ముని సేవాగ్రామమై యొప్పిన దీ పల్లెటూరు. పకృతి సౌందర్య నిలయము ఆయురారోగ్య ప్రదాయకమగు నవ్యత కలశము పల్లెటూరు.

భరతమాతకు నిలయమైన యేడులక్షల పల్లెటూళ్లు యన్యమత విదేశ సార్వభౌముల యధీనముననుండి వారి యభీష్టములకుపయోగపడి తనసహజ లావణ్యమును పోగొట్టుకొని దీనవదనముల చూపెట్టుచున్నవి. రాజవంశాలెన్నో నశించినవి. విప్లవముతరువాత విప్లవము తాండవించినది కాని భారతావనిలో మా పల్లెటూళ్ల పేదముఖమున సహనము ప్రతిబింబించుచున్నది.

గ్రామాభివృద్ధి గ్రామసేవ గ్రామపంచాయతీ విద్య కుటీర పరిశ్రమ కావాలె, చెరువాలె, ఉండాలె, స్థాపించాలె, యను నినాదములు గలనీరోజులలో మా మిత్రులు పల్లెటూరు మాస పత్రిక యొకటి యుండవలెనని మమ్ము ప్రోత్సహించిరి.

సంభాషణములో సర్వసాధారణముగా యందరినోట పల్లెటూరని యేవచ్చుచుండును కావున ఇదే సార్థక నామమున మా పల్లెటూరు వర్తించుచుండును,

ఇపుడు మా పల్లెటూరు స్వాతంత్ర్య దినోత్సవములు జరిపి గాంధీ దేవుని స్మరించి కరములు మోడ్చినది, దేవీ నవరాత్రిములు· దీపావళినివాళులు జరుపుకున్నది· గౌరీపూజకు పిమ్మట కార్తీక శుద్ధ పౌర్ణమి గూడ గావించి మిమ్ముల దర్శించు కొనుచున్నది. నూతన రాజ్యాంగమున పూర్వవికాసమును బడసి సౌఖ్యముగా నుండుటకై యెన్నికలలో నిలిచిన యభ్యర్థు ను తనయభీష్టము నెరిగించుకొను చున్నది.

పల్లెటూరు యభిమతముల గుర్తెరిగి రచనాత్మకమైన పద్యగద్యగేయముల బంపిన రచయితలకు ప్రేమ పూర్వకముగ సందేశముల నొసగిన పెద్దలకు, సద్భావమున సహకరించిన సన్మిత్రులకు మా నమస్కారములు.

# 'పల్లెటూరుకు' శుభాకాంక్షలు



"శ్రీ దేవీ ప్రసాదుగారు 'పల్లెటూరు' అను పేర మాస పత్రికను ప్రకటించ సంకల్పించుట చాల శుభావహము. తెలంగాణములో నిట్టి ప్రయత్నములు చేయువారు అరుదు. అందును జిల్లాలలోని వారిట్టి యుద్యమమును తలపెట్టినచో, వారికి ముద్రణాది సౌకర్యములు లభించుట చాల కష్టము: కనుక ఏవిధముగ జూచినను శ్రమ సాధ్యమనదగిన ఈ గ్రామ సేవలో ముందడుగు వేయువారు ప్రశంసార్హులు:

శ్రీ దేవీ ప్రసాదుగారు ప్రజాసేవ తత్పరులగు కార్యకర్తలు తెలంగాణా జిల్లాలలో వెలువడు పత్రికలు చాల కొలది. అట్టివానిలో వీరి పత్రిక యొకటి. ఇది పల్లెటూళ్లలో వసించు వారికి ఎక్కువ ఉపయోగ పడవలసియుండును. వారి జీవనమును ప్రోత్సహించునదియు వారి యవసరములను బయట బెట్టునదియగు పత్రిక ఎంతయో మేలుచేయ కలదు.

కనుక వీరి యుద్యమము సర్వవిధముల ప్రోత్సహించ దగినదని యభిప్రాయ పడుచు వీరి పత్రిక చిరకాలము నోచులేని పల్లెటూరి ప్రజలకు తోడ్పడు నట్లనుగ్రహింప దైవమును ప్రార్థించుచున్నాను."

ఆంధ్ర కుటీరము,<br>హైదరాబాదు,<br>౮-౧౧-౧౯౫౧ } **మాడపాటి హనుమంతరావు**

"పల్లెటూరు" అను మాస పత్రిక సంగారెడ్డి నుండి శ్రీ దేవీ ప్రసాదు గారి యొక్కయు శ్రీ శ్రీ. రామచంద్రారెడ్డి గారి యొక్కయు సంపాదకత్వమున వెలువడు నని తెలిసి చాలా సంతోషించినాను. తెలంగాణాలో మాసపత్రికల కొరత చాలా కలదు. ౨౫ ఏండ్ల క్రిందట రచయితల కరవు అపారముగా నుండెను. ఇంతలో చాలామార్పు కలిగినది. ఈ నాడు మంచి రచయితలు పెక్కురు పేరుగన్నవారైనారు దీనికి శాల మే ముఖ్యకారణము. అట్టివారందరును నిట్టి మాస పత్రికలకు తోడ్పడుట యవసరము.

ఈ సంపాదకద్వయములో నేను శ్రీ దేవీ ప్రసాదు గారి నెరుగుట ఈ నాటి మాటకాదు. ౧౯౨౦ నుండి నేను వారి నెరుగుదును. వారుగురుముఖముగా పాండిత్యమును గడించినారు. బహుకాలము విద్యాబోధకులుగానుండిరి. ప్రజాసేవశక్తి కొలది చేయుచువచ్చినారు. వారికి సారస్వత సేవయందు ప్రీతి. కావున "పల్లెటూరు" చక్కగా వృద్ధికి రాగలదని ఆశింతును.

తెనుగు పత్రికలకు తెలంగాణా మందు ప్రజాదరము తక్కువగా కానవస్తున్నది. విరివిగా సారస్వత పత్రికలకు ద్రవ్య సహాయము తుదకు చందా సహాయము లేకున్న అభివృద్ధికి రానేరవు.

ఈ పత్రికకు ప్రజాదరమును కోరుదును.

పత్రిక సకాలములో సక్రమముగా ఆకర్ష ణీయముగా వెలువడు చుండవలెననియు కోరుదును.''

— సురవరము ప్రతాపరెడ్డి

*

“పల్లెటూరు” అనే మాస పత్రికను సంగారెడ్డి నుంచి, శ్రీదేవి ప్రసాద్‌గారి సంపాదకత్వమున వెలువడు చున్నదని తెలిసి సంతోషించినాను.

పల్లె సీమల జీవితమునకు దేశీయులందరు అలవాటుపడి గ్రామసౌభాగ్యమును పెంపొందించుటకై అలవడునట్లు పల్లెటూరుపత్రిక పాటుపడగలదని దేశీయులను సరియైన మార్గమున నడిపించుటకు తోడ్పడగలదని ఆశించు చున్నాను.”

ఇట్లు

బూర్గుల రామకృష్ణారావు

*

“హైదరాబాద సికిందరాబాద నగరములకు సమీపమున గల జిల్లా కేంద్రమును గలిగినది మెదకు జిల్లా. మెదకు జిల్లా ప్రాచీన చరిత్రకు సంబంధించిన సంపదలో తులతూగుచున్నది. కొండాపురము, పఠాన్ చెర్వు మొదలగు చారిత్రకయాత్రాస్థలములు కలవు. సారస్వత సాహిత్యరంగమున మెదకు జిల్లాలో సింహగర్జనలు వినబడకపోలేదు. మొదటి ఆంధ్రమహాసభను వైభవోపేతముగ జరిపిన గౌరవము మెదకుజిల్లాకు చెందును. ఐనప్పటికి ఆర్థికముగ రాజకీయముగ ప్రక్కన నున్న జిల్లాలకన్న వెనుకబడియున్నదనే చెప్ప వలయును. ప్రకృతి శక్తుల పొందికకూడ ఇందుకు ప్రబల కారణము.

ప్రబోధము ఇతరాధికముగా ఈ జిల్లాలో సాగవలసియున్నదని విశ్వసించుదును. ఈమధ్య సారస్వత ప్రచారము ఊరూర జరిగినది. తమ జిల్లా వాసులలో ఆర్థికసామాజికస్థాయిని పెంపొందింప జేయవలెనను తలంపుతో “పల్లెటూరు” అను మాసపత్రికను వెలువరించడ మగుచున్నది. కుటీరపరిశ్రమలు, ఆరోగ్యము, వ్యవసాయము, సహకారమునకు సంబంధించిన సారస్వత వ్యాసములతో ఈ పత్రిక దేశసేవ చేయ తలపడుచున్నదని ఆశించెదను. దేశమున ప్రప్రథమముగా ఎన్నికలు జరుగనున్నవి. కొంత అడ్డాదిడ్డమైన ప్రబోధము సాగును. ఈ జడివానను ఆర్థిక సామాజిక సాంఘిక సౌష్ఠవమునకు ఉపయోగపడునట్లుగా ఈమాస పత్రిక కృషిచేయగలదని ఆశించుచు, తన పేరుకు వన్నె పెట్టగలదని ఆశింతును.

సేవాభావముతో సారస్వత ప్రచారము నిరంతరము చేయుచున్న మిత్రులీ పత్రికను నిర్వహించుచున్నందుకు ముదావహము.

ఆర్థిక సౌష్ఠవముతో దేశార్థిక పరిస్థితులను తీర్చి దిద్దునట్లు శక్తిప్రసాదింపబడుటకు నా ప్రార్థనలు.”

హితైషి

పులిజాల హనుమంతరావు

*

నామిత్రులు శ్రీదేవి ప్రసాద్‌గారు ప్రారంభించిన ‘పల్లెటూరు’ అను ఆంధ్ర మాస పత్రిక తెలంగాణ మండలి కోటి మంది తెలుగువారి హృదయాలలోని దివ్య సంచలనాన్ని గుర్తెరిగి నిజమైన పల్లెటూరిగా భాసిస్తుంది.

పట్నాలకు బదులు పల్లెటూళ్లనే ప్రసవించిన భారత మాత శాశ్వితముగా కృషిక్రశా

మిక జన సందోహాస్వేదధారాభిషిక్త పాదయుగళయై కవితా కుమారికి ముద్దు సూక్తుల నందించుతూ వరల గలదని నా నమ్మిక కనుక ఈ 'పల్లెటూరు' మాసపత్రిక అట్టి శ్రమికులను గూర్చిన రచనలనే అధికముగా ప్రకటించవలెననినా ఆకాంక్ష

తెలంగాణ ప్రజలు 'పల్లెటూరు'ను బలపరచ గలరని ఆశిస్తున్నాను

**దాశరథి**
**9-11-51**

✻

"దేహమంటే కాళ్ళు, చేతులు, తల, కలిగి సకలావయవవిశిష్టమైన సంపూర్ణ కళేబరమని యెట్లు గుర్తింపబడుతుందో, అట్లాగే దేశమంటే పల్లె, పట్టణ, గ్రామ, నగర, నిగమన, నదీనద, జనపద, సంపదితశిష్టమైనది అని అవగాహనమవుతుంది.

దేశసౌభాగ్యమునకు, పల్లెల సంపన్నత కారణము. ప్రజాహితసంస్థలని నేడు దేశమునే మార్మ్రోగుచున్న సంస్థలన్నియు ఉపన్యాసములలోనే కాలము సాగించుచున్న సమయమున శ్రీ దేవీప్రసాదుగారు, పల్లెటూరు పత్రికారంభముతో, పల్లెటూళ్ళను సుఖ, సౌభాగ్య జీవనసంపత్కరములుగా చేయు ప్రచారమున కుద్యమించుట దేశభాగ్యోదయమునకు ఉదయరాగము.

పల్లెటూళ్ళ పశు, శిశు, భూమి, జన, సౌభాగ్య సంపదలతో శ్రీ దేవీప్రసాదుగారి "పల్లెటూరు" మాసపత్రిక ప్రజా, ప్రభుత్వాదరణముల అచిరకాలమున వారపత్రికయై దేశసౌభాగ్యదాయియగుగాత !"

పండిత శతావధాని ఆయుర్వేదాచార్య
**వేదాల తిరుమల**
**వెంకట రామానుజస్వామి**

తెలంగాణములో తెలుగుపత్రిక తలయెత్తడం అంటే తెలుగుప్రజలకు నూతన నక్షత్రం కనిపించినట్లు. ఆంధ్రజిల్లాలన్నింటిలో పల్లెటూరులే అధికం. జీవితం పల్లెటూరి విధానమే. భూస్వామ్య యుగపుస్వరూపాలు, రాజకీయాలు మన పల్లెలనుండి తరలిపోలేదు. పల్లెటూరి సత్సంప్రదాయాలు నశించి, పెత్తనందారీమోటుతనం మిగిలింది. ప్రజానీకంలో ఇంకా ప్రజాస్వామిక చైతన్యం కలుగలేదు. మన కెన్నిభావాలున్నా ప్రజలం, ప్రజాస్వామికవాదులం కలిసి సంప్రదించుకొని గ్రామజీవితాన్ని దిద్దుకొనవలసియుంది. నైజాం పరిపాలననుండి బయటపడినా పడనట్లు భావించ గలిగినపరిస్థితులు తెలంగాణా పల్లెటూళ్ళలో రానేలేదు. పాఠశాలలులేవు. వైద్యశాలలు లేవు. కల్లుపాకలు హెచ్చేనేమో. మొగలులప్రతిగా తాజ్ మహలుంటే, నైజాంస్మృతి కల్లుపాకలే అవుతావేమో. జీవనస్థాయి ప్రజానీకానికికలిగించుటకు ఊరూర గ్రంథాలయం, సహకారసంఘం, పీడితుల వృత్తిసంఘాలు ఏర్పరచి వారి సమస్యలపై అనుదినం పనిచేసే యువకశక్తులను ఉత్సాహపరచాలె. సేవాత్యాగాలతో తడిసూరని మానవహృదయంతో విశాలాంధ్ర సాధించి భూస్వామ్యవిధానం, గుత్తపెట్టుబడిదారీవిధానానికి సామ్రాజ్య చిహ్నాలకు తావులేని క్రమబద్ధ ఆర్థికవిధానంతో నవరాజ్యంసాధించుటకు గ్రామసీమల ప్రజానీకాన్ని తయారుచేసి పట్టణసీమలలోనున్న గిర్ని కాంగారులతో కలిసి నడిచిన ప్రజాశక్తిని విజృంభింపజేసి ప్రజాస్వామిక కార్యాచరణకు సాగించాలె. అందుకు మీ 'పల్లెటూరు' పల్లెటూరులకు ముఖ్యంగా తెలంగాణా పల్లెటూరులకు మార్గదర్శిఅవుతుందని

ఆశించుచున్నాను. పత్రికలకు పగ్గాలు వేయబడినవి. కాగితం, అచ్చుపరికరాలు మాత్రమేగాక పత్రికలకు స్వేచ్ఛకూడా కరువే అయింది. అసలు అందరికీ తిండికరువు వుండనేవుంది. అయినా పల్లెటూరుద్వారా పల్లెటూరులలో స్వేచ్ఛకై, ప్రజాస్వామ్యానికై శాంతికై ప్రచారప్రబోధాలుచేసి ప్రబుద్ధాంధ్రతో విశాలాంధ్రం సాధించుటకై తాళికలు కండి. జై ఆంధ్ర.''

**వావిలాల గోపాలకృష్ణయ్య**

నేటి యీ అన్యాయసమాజములో పీడించి పీల్చి పిప్పిచేయబడుచున్న దాదాపు 85లక్షల తెలంగాణా ప్రజానీకానికి ప్రత్యేకముగా మన పల్లెటూరు అమాయక ప్రజానీకానికి తోడునీడనై, వారియొక్క సమాజ, విద్యా మరి ఆర్థికాభివృద్ధికై పాటుపడిననాడే మా 'పల్లెటూరు' మాసపత్రికకు జయము.

**కె. లక్ష్మినారాయణ**

'జనత' పత్రికసంపాదకుడు.

# చైతన్యకీల



**శ్రీ సినారె**

తాడిత ప్రజాగళాల
గూఢంగా ధ్వనిస్తున్న
నిద్రాముద్రిత వాణిని
నీరవనీరస వాణిని
చైతన్య జ్వాలలతో
నవజీవన కీలలతో
ఉరిమించగ తరలండీ
పలికించగ నిలవండీ
యుద్ధోన్మాదపిశాచపు
టురుకరాలలోనజిక్కి
కొనఊపిరి దీయలేక
గొణుగు మానవత్వానికి
నులివెచ్చని రక్తకణం

చిలికి ముందు నడవండీ
అర విచ్చిన శక్తిసుమం
పరిమళించ కదలండీ
కులమతముల మైకంలో
పచ్చివిషపు కాయలెన్నొ
నమిలినెమరు వేస్తున్న
అజ్ఞానం మేస్తున్న
ఈ మహాంధలోకానికి
ఈ దరిద్ర దేశానికి
అనురాగామృతఫలాల
నందించగ రారండీ
విశ్వానంద జ్యోతుల
వెలిగించగ చేరండీ

# పల్లెటూరు తిరుగలి

## శ్రీ ప్రసాద్

నేటికి రైలు మార్గమునకు మోటారు మార్గమునకు చాల దూరముగనున్న పల్లెటూరివారుల నిరాడంబరమైన నిత్యజీవనము తిరుగలిపైననే యాధారపడి యున్నది. పల్లెటూళ్ళలో ప్రతిదినము చేయుచున్న జీవనోపాదులలో తిరుగలియొకటి. ముఖ్యంగా స్త్రీలు యీ పని చేయుచుందురు. ప్రదోషకాలమున నాలుగు గంటలకు నిదురనుండిలేచి, నిత్యకృత్యములకు ప్రారంభమున విసురవలసిన గింజలను తిరుగలినుండి విసరుచుందురు. పిమ్మట యిండ్లముందట ఊడ్చి కలయంపి చల్లుకొందురు.

స్త్రీలు తిరుగలిత్రిప్పునప్పుడు హరినామస్మరణయో సాంఘిక జీవనసంబంధమగు నైతిక చారిత్రిక వీరోచిత గాధలను పాటల రూపకముగా పాడుచుందురు.

దాదాపు ముప్పది సంవత్సరములనుండి పిండి గిర్నీలు వాడుకలో వచ్చినవి. అప్పటినుండి చేతి తిరుగలి లేకుండబోయినది. ఇందువలన స్త్రీలకు తెల్లవారు జామున నిదురనుండిలేచు అలవాటు తప్పిపోయినది.

ఇందువలన అమూల్యమైన యొక అరగంట కాలము వ్యర్థమైపోవుచున్నది. ఉదయము నాలుగు గంటలకు ప్రదోషకాలము. అమూల్యమైనది. ఆరోగ్యవంతమైనది. ఆ సమయము రామనామస్మరణ అభ్యాసమునకు తిరుగలి ఆదర్శప్రాయముగా నుండెడిది. తిరుగలి వాడుకవలన ప్రతి దినము రాత్రి తొందరగా పండుకొని తెల్లవారుజామునతొందరగామేలుకొనుచుందురు. తిరుగలి జీవనాధారమైనది. కావుననే స్త్రీలు తిరుగలిని పూజింతురు. ఒకప్పుడు కబీరుమూర్తిపూజను ఖండిస్తూ యిట్లు చెప్పినాడు.

మందిరంబున రాతిని మాధవుడని
పూజజేతురు తిరుగలిపూజ విడిచి
తిరుగలియొసంగు రొట్టెల తిండికొరకు
అదియులేకున్న జీవనంబగునే జగతి

ఈ విషయము శ్రీ పూజ్య వినోబాజీగారు శివరాముపల్లి సర్వోదయ యాత్రాసందర్భమున సభ కృష్ణాపురములో తిరుగలినిగూర్చి ప్రశంసిస్తూ తిరుగలి జీవనాధారమైనదనినారు.

మన తెలంగాణలోగూడ తిరుగలి వాడుక కొన్ని ప్రాంతములలో యెక్కువగా నేటికి జరుగుచునే యున్నది. మహబూబ్‌నగరముజిల్లాలో స్త్రీలు తిరుగలి త్రిప్పుచు పాడుచున్నపాటను జానపద గేయముల క్రింద నీ దిగువ చూపెట్టబడియున్నవి.

భర్త—వాడింది నీ ముఖము – వన్నె జెదరించి
జారినవి నీ కురులు – జప్పాడుతావి
ఏమి దినగోరినది – ఇంతీ నీ మనసు

భార్య—రేతిరి పులిజున్ను – రేగు కాయలను
మాపటి పులిజున్ను – మారేడుపండ్లు
ఆమాటవిని రాజు – అమ్మ దగ్గరకు
అమ్మరో వోయమ్మ – మముగన్నతల్లి
నన్ను కన్ననాడు ఏమిగోరితివి.

తల్లి—ఇటువంటి కోరికలు – నే గోరలేదు
పొరిగింటికూరలు – పుల్లటంబళ్ళు
దోసిట యంబళ్ళు దొగ్గలి కూగ
అమ్మ మాటలు విని – హంసల రథము
ఆలుమగలిద్దరు – అడవికిబోయి
సతి నీవుగోరిన – ఈ చింతఫలము

### భార్యాభర్తలు

ఇటువంటి కోరికలు – నే గోరలేదు
మళ్ళెను ఆ రథము – మామిడితోట
మగువ నీ గోరిన – మామిడిపండ్లు
ఇటువంటి కోరికలు – నే గోరలేదు
పోయెను ఆ రథము – పులి వనంబునకు
గట్లల్లవచ్చిన బొట్ల పులిరాజు.
పట్టండి ఆ పులిని – పట్టు పగ్గాల
వెయ్యండి ఆ పులిని – అతి వేగిరమున
ఉడుకుడుకు రక్తంబు – దోసిట బట్టి
తనివిదీరా త్రాగె. తన భార్యయపుడు

భర్త—రాజ్య రాజ్యము – నేను తిరిగితిని గాని
రమణిరో నీ వంటి – రమణి నేనెరుగ

### భార్య

దేశదేశము నేను – చూచితినిగాని
దేవేంద్ర నీవంటి – పురుషుండు లేదు.

# కష్టసుఖములు

“జనపదమునకు పల్లెటూరని యర్థము సార్థకము. ఇచట నివసించువారికి జానపదు లనెదరు. ప్రాచీనకాలమున రామాయణాది గ్రంథముల యందుదాహృతమైనజనస్థానమను నర్థమొసగుప్రదేశము పల్లెటూరని భావము. పల్లెటూరివారి ప్రధానవృత్తి సేద్యము. సేద్యం వలన జీవనాధారమున కనుకూలమైన ధాన్య ముత్పత్తి నొనరించువాడు రైతు. కృషికుఁడే రాజ్యమునకు వెన్నెముకవంటివాడు. వెన్నెముక దృఢముగానుండినచో నవయవములన్ని సక్రమముగాఁ బనిచేయును. మనగ్రామముల యందలి సేద్యగాండ్రు ప్రాచీనయంత్రముల నుపయోగించి వ్యవసాయ మొనరించు చున్నారు. ఆధునికకాలమునందలి నూతన యంత్రములు వారికి దెలియవు. భూమినెంత లోతుగా దున్నిన మొక్కల మూలములంత లోతునకుఁబోయి మొక్క బలిష్ఠమై ఫలితము విశేషముగా నుత్పత్తిఁజెందుచున్నది. ఫలిత మధికముగాఁగోరిన లోతుదున్నుటమాత్రమే ఫలకారి కానేరదు. భూసారము నేటేట తగ్గిపోవుచున్నది కావున దాని నభివృద్ధిఁజెందించుటకు యెరువులు కావలయును. మన రైతు వాడు నట్టి యెరువులు పశువుల పేడ, గొర్రెల, మేకల మలము మొదలగునది పశువుల మూత్రములందధికమైన శక్తిసారము గలదు. పశుసంపద (గోధనము) విశేషముగా నుండిననే యెరువు విశేషముగా లభించి భూసారము క్షీణింపకుండును. అధికాహార పదార్థోత్పత్తికి కారణభూతులైన వ్యవసాయదారుల పురోభివృద్ధికి నవీనమార్గములనుప్రబోధించుటకుపత్రికాప్రచారమవసరము. అట్టి యుద్యమమునకుఁబూనుకొని శ్రీ దేవీప్రసాద్ యాదవ గారు పల్లెటూరను పేర మాసపత్రికను నెలకొల్ప సంకల్పించుటత్యంత శ్రేయోదాయకము. శ్రీ దేవీప్రసాదుగారు గ్రామీణసముద్ధరణమునకు బద్ధకంకణులై ప్రజాసేవ నొనరింపఁబూనుకొనియున్నారు. వీరిసదుద్యమమునకుఁ జేదోడు వాదోడుగా ప్రజానాయకులు విద్యాధికులు ధనాఢ్యులు తదితర ప్రజాహితైషులుండినచో గ్రామీణులుద్ధరింపబడుదురు. శ్రీ దేవీప్రసాదుగారు సంగారెడ్డియందు (౧౦) సంవత్సరములనుండి గోలకొండపత్రికాస్వకీయ విలేఖరులై పల్లెటూరుప్రజలకష్టనిష్ఠురములను ప్రకటితమొనరించుచున్నారు. ఆంధ్ర సారస్వత పరిషత్తు వయోజన విద్యాప్రచారమునకు కార్యకర్తలు, ప్రజాసేవకుఁ బాటుపడుచున్నారు. శ్రీ దేవీప్రసాద్ యాదవగారి సత్సంకల్పమునకు దోహద మొనరించి వీర కృషిఫలవంతమగునట్లు చేయూత నొసగుటకు స్థానిక ప్రముఖులు కృతప్రయత్నులు గావలయును. అప్పుడే వీరి యాశయములు ఫలోన్ముఖము లగును. సర్వేశ్వరుడు శ్రీ దేవీప్రసాద్ (యాదవ) గారి కాయురారోగ్య సౌభాగ్యములఁ బ్రసాదించుగావుతమని ప్రార్థించుచున్నాను. ప్రజాసేవయే ముఖ్యధర్మముగా దలంచిన యాదవగారి సదుద్యమము సఫలమగుగాక! ఓం తత్ సత్

ఎం. ఎస్. వీరయ్య



# విరాగిని అస్తమయం



మాత శ్రీగిరిజామాయిజీ బొంబాయికి వచ్చింది. బొంబాయి స్వాగతము చెప్పింది. తెలుగువారు మాయిజీకి సన్నిహితులైనారు, ఉత్తర భారతీయులు మాయిజి చెంతచేరారు, మహారాష్ట్రీయులు జై అన్నారు, పొగిడారు, పుష్ప వర్షాన్ని కురిపించారు. భక్తులైనారు. ఆమెతో గూడిభజనలు చేశారు. చిలుము చేత పుచ్చుకొని గంజాయి త్రాగితరించామని సంతోషించారు. ఆమెచెప్పే మాటలు విన్నారు ఆశాప్రేరితులైనారు. ఆమెను పాపులను రక్షించ వచ్చిన దేవత యనిభావించారు, కొందరుధనము ఐశ్వర్యము, కొందరు సంతానము, కొందరుతమ ఈప్సితములు ఈ డేరునను కొనినారు. ఆమూర్తిని యాచించారు, 'బిడ్డానీకుదొరికి తీరుతుంది. "బేటాతుముకుమిల్ జాయేగా, తూజావుత్రో, తుమాలమిలేల్" యిలాంటివరాలన్ని ప్రసాదించింది. కొల్లలుగాప్రజలుమాయిదగ్గఱకు రానారంభించారు. రూపాయిలు. చెల్లించారు, యజ్ఞము చేయాలేనని నిశ్చయించుకుంది, యాగకుండాన్నినిర్మించారు, చందాలు ప్రోగుచేస్తున్నారు. యజ్ఞము జరుగుతోంది బ్రాహ్మణులతో పాటురోజు వందమందికి అన్నదానము చేస్తున్నారు. కరపత్రములు ప్రకటించారు...... నాకుకూడా ఒక కరపత్రందొరికింది, నిర్వాహకులు సత్యనారాయణ పంతులుగారి నడిగాను, "శ్రీవారి దర్శనం చేసుకోవచ్చునా, యని," ఆయన కోపం వచ్చింది. మీ లాంటి యువకుల్నినాస్తికుల్ని బాగా చూచాంపోవయ్యా అన్నాడు — ఈ రేషన్ కాలములో ఎందు కయ్యా అన్నదాన ఖర్చులు అన్నాను. ఉపవాసముండే బీదవాళ్ళకె అన్నదానము చేస్తున్నామన్నారు. ఒకనాడు ఆలస్యముగా ఇంటికివచ్చాను. నేను తినేహోటలు మూసివేయబడింది — ఈ పూటకి నేను ఉపవాసమేనని పంతులుగారితో అన్నాను. 'యజ్ఞశాలకు వెడదాం నడు అన్నారు. ఇద్దఱం వెళ్ళాం, మండలికి నమస్కరించాం. మాయిజీ లోపల వున్నారు. భోజనంచేసి బయటికి వచ్చాను. యేమైనా అప్పటికి మాత్రం, ఇటువంటివి జరుగాల్సిందే, అనుకొన్నాను. నాకుగూడ మాయిజీఅంటే భయభక్తులు కలుగజొచ్చాయి. క్రిమక్రమంగా.

కొన్నిరోజుల అనంతరం.

ఆమె నివసిస్తున్న గోపాలనగరం, సెంచురి మిల్లుప్రక్కన, నాకు వెళ్లవలసి వచ్చింది. (B.C.S.E.C. బొం. నగర, సమాజ శిక్షణ) ఆధ్వర్యాన నడుపబడె తెలుగు తరగతులలో నేను కొన్నితరగతులు నడిపిస్తాను. గోపాల నగరంలో ఇదివరకు ఒక్క క్లాసుగూడనడచుటలేదు. గాన నేను ఆదేశించబడ్డాను. బోర్డు పలకలు, పుస్తకములు రోడ్డుపై పెట్టినాను. చేతసీమసున్నముంది. ఆలోచిస్తున్న యేఫలం బాగుంటుందా ? అని, ఒకాయన అమ్మ

గారి పందిట్లో చెప్పమయ్యా అని సలహాయిస్తే వెళ్ళాను. అమ్మగారికి నమస్కారము చేసి విషయం వివరించాను. యెన్నో ప్రశ్నలకు నాచే సమాధానములు తీసికొంది. 'మాటకారి ముసలిదేరా' అని మనసులో అనుకున్నాను.

ఆమె పొట్టిగా, నల్లగావుంటుంది. జడలు చాల పెరిగివున్నాయి. కాయబట్టలు, లుంగి, ఒక అంగీ తొడుగుకొని యుంటుంది. రుద్రాక్ష హారాలు జుట్టుకు, దండలకు జుట్టుకొంది, మెడలో ఒక రుద్రాక్షలమాల. మరియు లింగపుకాయల హారము. చేతిలో రుద్రాక్ష మాల ఒక త్రిశూలము–దాదాపు అన్ని భాషల్లో మాట్లాడుతుంది. ఎదుటివారిని చూరగొంటుంది, ఆధ్యాత్మికముగా వారికి నచ్చేటట్టుగా, హస్తాభినయనములో సహా వారి నమ్మించటానికి బలంగా వాదిస్తుంది. ఆమె ఇండియాఅంత తిరిగిందని ప్రతీతి, ఆమె జన్మస్థానము ఆర్మూరు. జి॥ నిజామాబాదు అని కొందఱన్నారు. నేనడిగితే నాజన్మస్థానము భారతభూమి యంది.

నేను రోజు 8-30 గంటలకు అక్కడకు వెళ్ళేవాణ్ణి. నమస్కరించేవాణ్ణి. ఆమె అదివరకు స్నానము జపము పూర్తిచేసికొని యుండును. ఒక్కరొక్కరే భక్తులు రానారంభించెవారు, మాట్లాడి వెళ్ళేవారిలో ఇద్దఱు ముఖ్యులు. ఒక మహారాష్ట్రియ వనిత, రెండవవాడు ఉత్తర భారతీయుడు. వీరిద్దరికి సంతానవరము నిచ్చింది మాతాజీ. పూజిస్తున్నారు. తమకు లాభం కలుగాలియని, పాపం ఖర్చుగూడ చేసికొన్నారు. ఆమె గుడికట్టుటకు నిశ్చయించుకొంది. లింగమూర్తిని తన నివాసస్థానములో ఆవిష్కరించింది.

ఆమె తన స్మారకాన్ని బొంబాయిలో విడచుటకు యెంతో ప్రయత్నం చేసింది. ఆంధ్రజన సంఘం అధ్యక్షులు శ్రీ ఎ. రావు గారు ఆమెను వెంబడించాడు. స్వార్థంకొఱకో! పరార్థంకొఱకో ఆసంగతి ఆయనకే తెలుసు. ఏమైనా ఆమెను మాత్రం తన కీలుబొమ్మగా ప్రయత్నం చేశాడు—నేను శీలంగారితో చెప్పి, మున్సిపాలిటివారితో ఆజ్ఞనిప్పిస్తానన్నాడు. మధ్యపాన నిషేద వారోత్సవాల సందర్భంలో బొంబాయికి వచ్చిన పట్టాభిగారి మీటింగులోకి కూడ వచ్చింది. పాపమామెకు అది జీవితసమస్య. కాని వేఱు వారికి అది క్షుద్రప్రశ్న___సభలో పూలహారం పట్టాభిగారికి వేసింది. వేఱ యేభాగ్యాన్ని ఆమె పొందలేదు. గుడికట్టేతొందర ఆమెలో ఎక్కువైంది. అప్పులైనాయి. ప్రజల్లో కొంచెం భక్తి సన్నగిల్లింది. పరిస్థితి విషమించింది. 'గోరుచుట్ట మీఁదరోకలిపోటు' అన్నట్లు ఆమెను ఎక్కువగా విశ్వసించెవారిలో మొదటివాఁడనిపించుకోతగ్గ ఉత్తర భారతీయుడు తిరుగుబాటు చేశాడు. రెండునెలలకు గర్భముదాలుస్తుంది నీభార్య అని చెప్పితివి, ఏమాయే. ఆరునెలలాయె'. అని గద్దించాడు లేకపోతే నావెయ్యిరూపాయిలు నాకివ్వమని అడుగుచున్నాడు- ఇద్దరిమధ్య ప్రసంగం పెరిగింది. చివరికి తిట్టుకున్నారు. 'రాండ్ తూనె ముఝె ధోకాకియా'. అని గర్జించాడు, భయ్యా. 'తేరాబీవి రాండ్ హై తేరామాఁ రాండ్ హై ఔర్ తేరాఖాందాన్ రాండ్ హైఁ' అని తిరిగి కోపముతో ప్రత్యుత్తరమిచ్చింది—నేను చూస్తు విస్తుపోయాను. ఇదేమిటని నాకళ్లను నేనేనమ్మకుండా వున్నాను. "తేరాముఁ దేఖవానహీ," ఆమెఅంది

'రూప్యే నహీంది మెతో బీచ్ బజార్ మె గలె మె చెప్పల్ డాల్ కె వసూల్ కరూంగా', విరాగిణి కాదు కురాగిణిని, భక్తులుగారు స్వార్థులు అని నిర్ణయంచేశాను. దొంగ వేషాలవెనుక యేమేమి దుశ్చేష్టలుంటాయో తెలుసుకొన్నాను. ఆమె తన జీవితంలో ఈ ఘట్టాన్ని అపూర్వ పరాజయంగా భావించింది. చింతించింది, అన్నము మానుకొంది. రోగి అయింది. కాని ఆమెను సమీపించేవారు చాల తక్కువ, భజనభక్తులు జారుకున్నారు. ఆశభక్తులు దూరమైనారు. విరాగిణి నిజంగా విరాగిణి అయింది- నిజమైన విరాగిణి అయింది.

ఒకనాటి సాయంకాలం, 5-30 గంటల సమయం, వర్లీపరియా మురికినీళ్ళన్నిటిని తీసుకొని ఒక ఘటారి (మురికికాలువ) గోపాల నగర్ వెనుకటకున్నుంచి ప్రవహిస్తుంది. అది యిస్తున్న వాసనకు యమునాతీరంలో విహరించే పథసికుడైనా అందుకే మిషాలు అక్కడ నిలుచుండలేడు దానిబడ్డున క్రమంగా 50 గుడిసెలవరకున్నాయి. అదియే గోపాల నగరం, అస్తమించబోవుచున్న సూర్యుని కిరణములు ఆగుడిసెలపై తమ ప్రభావం వేయుచున్నవి. గ్లోబ్ మిల్లు పాసేజ్ నుంచి కార్లపై పోవు వ్యక్తులకు 'నాదరిద్రంజూడు నాలో నివసించేవారి కష్టాలు జూడు' అని ఒకటొకటి చెప్పుకొన్నట్లు కనపిస్తాయి. అక్కడ నివసించే వారు బొంబాయి వాస్తవ్యులు అవవచ్చును. కాని బొంబాయి నాగరికులు మాత్రము కాదు'. మాకు నాగరిక హక్కులు లేవా' 'మాజీవితం ఈ చీకట్లో ఈ విధముగా ఇట్లాగేగడచ వలసిందా' అన్నట్లు వారిద్దె సందిన జీవితం ఆరోగ్యస్థానికి వెళ్ళే ప్రతినాగరికుణ్ణి ప్రశ్నిస్తుంది. కాని మానవత్వం, లేని నేటి నాగరిక ప్రపంచం వారిని అర్థంచేసుకొంటుందా! కాని ఈనాడు మాత్రం గోపాలనగరం జనసమ్మర్దంగా వుంది. ఏక కంఠం, ఏకభావం, ఏకోద్దేశ్యం ఆ జనములో గోచరిస్తుంది. జై మాయిజీ గిరిజామాయికిజై జై-జై గిరిజజామాయిజీకిజై' అంటు నినాదాలు చేస్తున్నారు. గోపాలనగరం ఆనాడు తీర్థ స్థలమైంది. [illegible] కలిసింది. మధ్యలో ఒక కుర్చీపైకూర్చుంది చైతన్యములేని తన భౌతిక దేహాన్ని వదిలివేసింది. పూలమాలలు వచ్చిపడుతున్నాయి. కొందరు ఏడుస్తున్నారు. కొందరు ఆమె ఎదో తెలుసుకుంటున్నారు కొందరు [illegible] దానా [illegible] భక్తిపూర్వకముగా మెమరచి [illegible] కొందరు దుఃఖములో బరువైన గుండె తో మాటాడలేని స్థితిలో నున్నారు' 'పాపం [illegible] ది [illegible] కొనిపోతుంది. అన్నా [illegible] భయ్యా గూడ పడుగెత్తుకుంటూ వచ్చా [illegible] - మాతాజీ అని ఏడ్చాడు గిరిజామాయికిజై అన్నాడు-శవయాత్రలో పాల్గొన్నా[illegible]

శవం ప్రక్క[illegible]లు మున్నారు— చైతన్యవిరాగిణిని దూషి[illegible], ఆ చేతన శవం ముందు క్షమాపణ కోరు కుంటున్నట్టు కనుపిస్తుంది ఆయన ముఖం. ఏ. రావుగారు వెంట నడుస్తున్నారు— అనాదాసుల కిష్టయ్యా భక్తిపూర్వకంగా చెప్పుట్లు కొట్టు కొంటువడుస్తున్నాడు. సత్యనారాయణ పంతులుగారు అంతకు మొదలె శవం యెక్కడి యెక్కడి నుంచి తిరిగి పోవలయునో ఏర్పాట్లుచేశారు_ పోను పోను శవ యాత్రలో ఎక్కువ మంది కలియజొచ్చారు— నినాదాలు యిచ్చేవారిలోఏకమై నినాదాలిచ్చారు. గిరిజామాయి

యెవరో తెలిసికొన్నారు. ఐ. డి. డి. చాల్ల పై భాగముల పై స్త్రీలు, పురుషులు, పిల్లలు పరిదర్శనాన్ని వీక్షిస్తున్నారు. వర్లి నుంచి జులూసుకదిలింది. ఫర్‌గుసన్ రోడ్డు మరిజన సమ్మర్ధంగా తయారైంది- వర్లి నాకానుంచి. "O" రోడ్డు పై శ్మశానం దిక్కు పోయింది. వర్లి నాకాదగ్గర నిలుచుని. జులూసును వీక్షించాను. జులుసు మూలతిరిగి నాకు కనిపించకుండా అయింది—జూలూసు శ్మశానం పోవుచున్నప్పుడు- వినాదములు ( ) ము వసవిస్తుయి—విరాగిణివి అస్తమించింది. సూర్యుడస్తమించాడు. అదే సమయ నాదృష్టిలో నుంచి విరాగిణి అస్తమయం.

హృదయ పూర్వకముగా ఆహ్వానించిన బీద ప్రజలు మొదట ప్రేమించారు, తర్వాత కఠినముగా ద్వేషించారు. మరణానంతరం తిరిగి ప్రేమించారు. భౌతిక శరీరాన్ని సాగనంపారు. ఆత్మను తమలో నిలుపుకొన్నారు. భక్తిని శాశ్వతంచేశారు! ఇది యెట్లు వారి జీవితంలో సార్థకమగును. యెవరి వర్తించును?

ఇట్లు

సి. కిష్టము రాజు
ట్రేడ్ యూనియనిస్ట్

# పల్లెటూరు పరుగు

## శ్రీ ఎం. నాగయ్యగారు

పరగు, పరగున, పరగు, లిడుమా ఓ పల్లెటూర, ప్రజల మనముల, చూర, గొనుమా
ప్రజలెల్లా గుమిగూడి పరగ స్వాగతమొసగ, పరమార్థమగు సేవ ప్రజలకున్ జేయుమా ప॥
బీదసాదలె బాధలల్లా నీసాధువర్తనమునన్ సరిదిద్దగాను, సాగియుండుడగెయ్యుమా ఓ పల్లెటూర ప॥
పల్లియప్రజలలో వెలుగజ్ఞానజ్యోతి, నెల్లప్పుడు వెల్గింపుమా-అజ్ఞాన జ్యోతిని ఆర్పుమా॥
బాలబాలికలందు ప్రభలింపుమున్నతిని, బహుకథా, నీకల చేతా - భావి పౌరుల భళిమనగన్
కర్షకావళికెల్ల కల్పతరువై వెలయ, కిర్షకోద్యమ కళలచేన్ - హర్షంబు చేకూర్చుమా - ఓ॥ ప॥
గ్రామీణ ఉద్ధరణగారవముతో జేసి గౌరవంబును గాంతుమా ఓ పల్లెటూర॥ పర॥
జాతిపితసూత్రిముల ప్రాతిపదికగ జేసి - జాతీయితనుగూర్చుమా ఓ పల్లెటూరజాతి బేదము మాన్పుమా
ఆ చంద్రతారార్కమభి వృద్ధి గాంతుమా అవని నా, దర్శముగనూ - ఓ॥ ప॥
మానవుని సేవయె మాధవుని సేవనెడు మాటను పాటించి చనుమా-ఓ పల్లెటూర-మాట॥ ప॥



# అవసర నైవేద్యం



పి యస్. ఆర్. ఆంజనేయశాస్త్రి

రంగయ్య పొలంనుంచి వచ్చి ఎద్దుల్ని కొట్టంలో కట్టేసి బుజాననాగలి మూలపెట్టాడు. పంచలో కూచుని పాపాయినాడిస్తున్న పెద్దకుర్రాడొచ్చి తెగిలోపలకు వంచుకుపోయిన నులకమంచాన్ని అతనికోసం వాల్చాడు. ఎన్నిముళ్లు పెట్టినా తెగిపోయిన నులక, మంచంనుంచి క్రిందికి వేళ్లాడుతోంది. తను రోజూ కష్టపడి పాదులుతీస్తు నీళ్ళుపోసి పెంచుతుంటాడు పొట్లపందిర్ని. ఈ తెగిపోయిన నులకిల్లాగా ఆపందిరినుంచి పొట్లకాయలు వేళ్లాడితే బాగుండదూ? తన దరిద్రంలోంచి ఒక్కసారి అపచ్ఛదనాన్ని ఊహించుకున్నాడు రంగయ్య. చెమటతో తడిసిపోయిన పొట్టిచేతుల బనీను విప్పుతూంటే ఎక్కడో 'పట్టు' మంది. చిరుగు చూచుకొంటూండగా నాలుగోవాడొచ్చి తనకోసం ఎవరో ఇద్దరు ముగ్గురు వచ్చిపోయినట్టు చెప్పాడు. పాపాయి గుక్కపట్టి ఏడుస్తోంది. పెద్దవాడు సముదాయించలేక పోతున్నాడు. గూటిదగ్గర కెళ్ళి చూశాడు, పాపాయికి పోసేపాలడబ్బా 'ఖాళీగా' కూర్చుంది.

'రంగయ్యా!' అని పిలుపు వినబడింది, ఇందాకొచ్చివెళ్ళినవాళ్ళే మళ్ళీవచ్చారని నాలుగోవాడు పరుగుతో వచ్చి చెప్పాడు. ఎన్నడూరాని వాళ్లు తనకోసం రావడమేమిటా అని అనుకుంటూ, కిట్టుచెప్పులు తొడుక్కొని అంతవరకూ తలపాగగా ఉన్నగుడ్డ, పైమీదకప్పుకొని రంగయ్య వాకిట్లోకి వెళ్లాడు.

చక్రిధరరావుగారి మనుష్యులు, 'రావయ్యా! రంగయ్యా. ఏంచేస్తున్నా, వంటూ; చూరుతగలకుండా వంగి గడపదాటుతూన్న రంగయ్య నాహ్వానించారు. 'పొలంలో ఏంవిత్తావని కుశలమడిగారు. రంగయ్య పొగాకు విత్తినసంగతి చెప్పాడు. 'అదేమిటి...? దేశం కరువుకాటకాల్తో కటకటలాడి పోతుంటే, వ్యాపారపైరులు వెయ్యకూడదు రంగయ్యా! అధికాహారోత్పత్తి చెయ్యాలి' అని వాళ్లల్లో ఒకడు ఉపన్యాసధోరణిలో అందుకున్నాడు. రంగయ్యకు గూటో ఖాళీపాలడబ్బా మొన్ననే ధాన్యసేకరణ సందర్భంలో తాను కొలవాల్సివచ్చిన గింజలు కొల్వగా ఆకలితో లోపలికీ దించుకుపోయిన పొట్టలాగా తరిగిపోయినగాదె జ్ఞాపకమొచ్చాయి. పరిస్థితి అంతా చెప్పాడు. ఇక ముందింక కష్టాలుండవన్నాడు వాళ్ళల్లో ఒకడు. ఒకరి కష్టాలకొకరు ఆదుకోకపోతే మానవత్వానికి విలువేలేదని తేల్చాడు మరొకడు. తన పొలం జీవితంలో ఎప్పుడూ ఆబస్తీమాటలు రంగయ్య వినలా. ఈ ఆలోచనలతో రంగయ్య చక్రధరరావుగారింటిదాకా వాళ్ళతో నడిచాడు. చక్రధరరావుగారు ఇంటి అరుగుమీద కూర్చొని ఉండటం చూచి ఆయనకు నమస్కారం పెట్టాడు రంగయ్య. నోటిలోని చుట్టను చప్పరిస్తూ ఆయన రంగయ్య కుశలం తెలుసుకున్నాడు. ఇంతలో వాళ్ళల్లో ఒకడొచ్చి పిల్లలకు పోసే పాలడబ్బా 'తీసుకో రంగయ్యా!' అంటూ రంగయ్య చేతుల్లో ఉంచపోయాడు. ఆశ్చర్యంతో తాను అసలీ సంఘటన యేమిటా అని ఆలోచిస్తూంటే, 'రంగయ్యా! రైతుల కష్టాలు నాకు తెలుసు; ఉంచు లే, అదిఉంచు' అన్నాడు చక్రధరరావుగారు. పదిమందిలో తిరుగుతూ ఉంటాడాయె ఆయన-అవూళ్ళో అయనకో జీపుకారు కూడాఉంది - తానేం మాట్లాడలేకపోయాడు. ఆమాటా, ఈమాటా మాట్లాడి రంగయ్య లేవబోయాడు. 'ఆ(..., ఇదుగో, ఇదివరకు చెప్పా, జ్ఞాపకముందిగా దగ్గరకొస్తున్నాయి, నువ్వునాకే వెయ్యాలి. ఈ సంగతి మీ వెంకన్నకూ, మీవాళ్ళకూ చెప్పు; సరే-వెళ్లు పాపం-అదుగో పాలడబ్బా తీసుకో-మర్చిపోకు' అని తను ఏమిచెప్పడానికీ వీలులేకుండా మాటల్లో ఉక్కిరిబిక్కిరి చేశాడు చక్రధరరావుగారు. నిజంగా అవసరం తెల్సుకొని సాయంచేసిన చక్రధరరావుగారు చాలా మంచివాడేననిపించింది. అందుకనే కాబోలు-ఎప్పుడూ ఆయన్ని అందరూ కార్లల్లో తిప్పుతారు!

అయినా రంగయ్యకుతన జీవితం కొంతసిగ్గుగా తోచింది. తనే యిలా ఉన్నాడుగాని తనతోపాటు కొందరు రైతులు-అందాకా దేనికీ, బసవయ్య- బస్తీలు వెళ్ళి నిభాయించుకురావటం నేర్చుకున్నాడు. ఏమిటో పట్నమీద అబస్తీ-యీబస్తీ తిరుగుతూ ఉం

టాడు. చక్రిధరరావుగారంటే కోర చూపులు చూస్తాడు బసవయ్య. బసవయ్యమీద ఆయన పోలీసులతో ఏమిటో చెప్పాడనీ, అందుకని ఆయనంటే బసవయ్యకు కోపంట అనీ వెంకన్న కాబోలు తనతో ఓసారి చెప్పాడు. ఆరోజున తనకు మనస్సు బాగుండక వెంకన్న చెబుతూంటే ఊకొట్టాడంతే-రెండు రోజుల క్రితం తను పంచలో కూర్చుంటే బసవయ్యవచ్చి తనో చుట్టచుట్టుకుంటూ తనకొక చుట్టఇచ్చి చెప్పినమాటలు జ్ఞాపకమొచ్చాయి రంగయ్యకు. రైతులంతా పడుతున్న కష్టాలన్నీ తొలగించుకొని స్వేచ్ఛగా హాయిగా బతకొచ్చుననీ అసలన్ని కష్టాలు డబ్బు సమస్యతో వస్తున్నాయనీ యీ బొజ్జలు పెంచుకున్న వాళ్ళందరి బొజ్జలూ కరిగించాలనీ చాలా చాలా చెప్పాడు. మళ్ళీ మళ్ళీ కనపడుతూ ఉంటానన్నాడు కూడా. ప్చ్... ఆఁ... అతనూళ్ళో ఉండడమే తక్కువ---

తర్వాత పదిహేనురోజులక్రితం విత్తనాలకోసం బస్తీవెళ్ళినప్పుడు జానయ్య రమ్మంటే అదేదో మీటింగుకు వెళ్ళాడు తను. అక్కడ-వాళ్ళూ ఇదే. రైతుల కష్టాలు తొలగించేస్తామన్నారు. ఒంటిమీద పాకుతున్న పురుగును దులిపివేస్తే పోతాయా కష్టాలు? తను మాత్రం తను... ఎంతపొద్దుపొద్దుగా వాడుకుంటున్నా యీడొచ్చిన బిడ్డకు పుస్తెకట్టించలేక పోతున్నాడు. ఈ కష్టాలు తొలగిస్తామన్నవాళ్ళు తుఫాన్లాపగలరా? వరదలాపగలరా? మిడతలదండ్లనాపగలరా?- ఏంచేస్తారో రంగయ్య కర్థంకాలేదు. వీటివల్ల బోలెడంత పంటకూడా నాశనమైందని జానయ్యే పేపర్లుచదివి తనతో చెప్పాడు. జానయ్య కూడా అందరూ కష్టాలులేకుండా సమానంగా బ్రతకాలని అంటూ ఉంటాడు. ఆమీటింగులో కూడా యీ మాటే అన్నారు. వాళ్ళు చాలా మంచివాళ్ళనీ అందరికష్టాలు తెలుసుకుంటారనీ జానయ్య చెప్పాడుగాని తనుమాత్రం వాళ్ళెక్కడాసాయైనా తన ఊరొచ్చినట్టు ఎరగడు. ఏమిటోలే, ఎవళ్ళపనులు వాళ్ళవి, తన కష్టాలుతనవి.

ఈలోగా గూట్లోంచి పాలడబ్బాలు ఖాళీ అవుతూనే వున్నాయి, ఖాళీ అయినవాటిని రంగయ్య రెండేళ్ళ కుర్రాడు దొర్లించుకుంటూ ఆడుకుంటూనే వున్నాడు. మూడురోజులకోసారి, నాలుగురోజులకోసారి బసవయ్యో, జానయ్యో, చక్రధరరావుగారి మనుష్యులో రంగయ్యను కలుసుకుంటూనే వున్నారు, రంగయ్య అందరితోనూ గుండెలు విప్పి మాట్లాడుతూనే వున్నాడు...

ఆ రోజున ఊరినిండా కార్లు దిగాయి. రంగుల రంగుల జండాలెగురుతున్నాయి. కాస్తమీసాలు గడ్డాలొచ్చినవాళ్ళు, పమిటెలు సరీగా వేసుకోడం చేతైన వాళ్ళు- అంతా- కొందరు నడిచీ కొందరు కార్లమీదా పోతున్నారు. ఓ-కోలాహలంగా ఉంది. తనుకూడా పోవాలి తప్పదు. రెండురోజులనుంచీ వరసన బసవయ్య, జానయ్య, చక్రధరరావు గారి మనుష్యులూ మరీమరీ చెప్పిపోతూ వచ్చారు. ఓ గంటకిందట కూడా చక్రధరరావుగారి మనుష్యులు జీపులో వచ్చి మేం వెళ్తున్నాం, రమ్మన మన్నారుగాని తనేకాస్త చద్దితినొస్తానని వాళ్లను పంపించేశాడు. ఏదోనలుగురితో మాట్లాడుకుంటూ వెళ్ళొచ్చు. చద్దితిని చివరకు తనుకూడా అక్కడికిచేరుకున్నాడు. అంతా తీర్థ ప్రజలాగా వుంది. ఆ చక్రిధరరావు గారి మనుష్యులు ఎంతో మంది మధ్యన ఏమిటేమిటో మాట్లాడుతూ తీరికలేకుండా ఉన్నారు. తనుపోయిఎవుని కలుసుకుంటాడు? ఏమితోచక రంగయ్య అటుయిటూ చూస్తున్నాడు. ఇంతలో రంగయ్య అనిపిలిచి తాము చక్రధరరావుగారి మనుష్యుల మంటూ ఎవరో తనను తీసుకెళ్లారు. మంచి మిగలముగ్గిన చక్రకేళీలు ఫలాహారం పెట్టారు. అబ్బ! ఈ చక్రకేళీతోట ఎంతబాగుంటుందో! గెలలు మొయ్యలేక వంగిపోతున్న చెట్లు ఎన్ని ఉన్నాయో ...సరే! వాళ్లెవరో గుర్తుచెప్పారు, అక్కడిచ్చిన కాయితం తనువేసి యింటికొచ్చాడు. అక్కడికెళ్లేప్పుడు కనపడ్డవాళ్లంతా తనను చూసినవ్వుముఖంచూపించారుగాని వచ్చేప్పుడు తనకు దాహమై మంచి నీళ్లడిగితే అందరూ పనిలో ఉన్నట్లు అటూయిటూ తిరిగారేగాని ఒక్కరూ తనవంక చూడలా. ఇంటికొచ్చి పెద్దవాడు మంచినీళ్లు తెచ్చిస్తే తాగుతూ నవ్వుకున్నాడు.

ఆ మర్నాడు చక్రధరరావు గారి మనుష్యులొచ్చి ఇంతాచెప్పి ఇంతగా అవసరాల్లో ఆదుకుంటు వచ్చినా చివరకు నైజంచూపించావులే, దేశమేమి బాగుపడి చస్తుందీ అని తిట్టిపోయారు. బసవయ్య మళ్లీకనబడనే లేదు. జానయ్య కనిపించి కూడా ఏవేవో నిష్ఠూరాలుగా మాట్లాడాడు.

ఆ వేళ సాయంత్రం పాపాయికి పాలడబ్బా తెచ్చిచ్చి ఒక్కసారి యెత్తుకుదింపి పొలంవేపు వెళ్లాడు. మర్నాడు పొద్దుటికి తెలివివచ్చి ఆసుపత్రిలో

( తరువాయి 16 పేజీలో )



# ఢిల్లీలో జరిగిన వ్యవసాయ విద్యావిధాన సంస్కరణ సమావేశము

శ్రీ కే. యం. మున్షీ గారి అధ్యక్షతలో నవంబరు 4 వ తేది వ్యవసాయ విద్యావేత్తల సభ న్యూఢిల్లీలో జరుపబడినది. భూములను సారవంతమైనవిగా మార్చే అందుకు వ్యవసాయ పరిశోధన సంఘములో అంతర్భాగంగా వ్యవసాయ విద్యాసంఘము ఒకటి ఉండాలని తీర్మానించారు. వ్యవసాయ పశు చికిత్సలను గూర్చి, ఆటవిక విద్యావిధానాలను గూర్చి, ప్రతి వ్యవసాయ కళాశాలకు గ్రామాలు ప్రత్యేకింపబడ వ్యవసాయ శిక్షణజరుగాలె వ్యవసాయికళాశాలలు గ్రామసీమలో స్థాపించాలె, వ్యవసాయపరిశోధనలు విరివిగా కావాలే యను విషయములపై తీర్మానాలు జరుపబడెను.

శ్రీ కే. యం. మున్షీ గారు 'పంటభూములు ఫలవంతంగా చూచ్చుటకు సమర్థులైన జ్ఞానసంపన్నులైన కార్యకర్తలు అవసరము. విద్యార్థులకు వ్యవసాయముపైన యభిమానం పెంపొందాలె. అప్పుడే వ్యవసాయాభివృద్ధి కార్యక్రమము నెరవేరుతుంది. భారతదేశములో జనాభా నానాటికి పెరుగుతుంది. దేశానికి ఆహారధాన్యాల పంట అధికము కావాలి. జనాభా సంవత్సరానికి 40 లక్షల చొప్పున పెరుగుతుంది. 1961 సంవత్సరములో 560 లక్షల టన్నుల ఆహారధాన్యాలు కావలసి వచ్చును. తెగుళ్లవలన కోతులు మొదలగు అడవి జంతువుల వలన పంట చెడిపోకుండ కాపాడబడాలి. దేశములో సాగు క్రిందకి రాదగిన 40 కోట్ల యకరాలలో నూటికి 16 వంతు బంజరుగా ఉన్నది. 23 వంతుల సాగు చేయవలసిన భూమి, వృధాగా పోతుంది. ఈ విధంగా 12 కోట్ల యకరాల భూమిలో 30 లక్షల యకరాలు చాలకాలము నుండి వచ్చుచున్న పాత వ్యవసాయ మూలకముగా నిస్సారమై పోతుయున్నది. కనుక భూముల స్వరూప స్వభావాలను సంపూర్ణంగా మారబడితేనే మనకు అభివృద్ధిలో యేమి లోటు ఉండదు అని ఉపన్యసిస్తు ఇంకా ఇలా అన్నారు.

ఇప్పుడున్న అధికారులకు రైతులతో వ్యవహరించు అనుభవము శూన్యము. సకారపద్ధతి పై వ్యవసాయము సాగించుట అనేది ప్రస్తుత ముఖ్యసమస్య. పట్టణములో వారికి, వ్యవసాయ కార్యకలాపాలు గౌరవహీనమైన



రజాకారు దౌష్ట్యాన్నుంచి హైదరాబాదు రాష్ట్రాన్ని పరిరక్షించి రాష్ట్ర స్వాతంత్ర్యచరిత్రకు స్వర్ణశీర్షిక లిఖించిన నేటి కేంద్రప్రభుత్వ ఆహారమంత్రి

గౌ. శ్రీ. కే. యం. మున్షీగారు.

వని భావింతురు. ఇంకా వ్యవసాయకులు పాతపద్ధతినే పట్టుక తంటాలు పడుతారు. కావున రైతుల మనస్తత్వము మారునట్లు చేయాలె, విద్యార్థులకు వ్యవసాయము పైన అభిమానము కలుగజేయాలె. వ్యవసాయములో నుత్తీర్ణులైన పట్టభద్రులకు మంచి కర్షకుడుగా తయారు అయ్యి భూమి దున్నుటకు అనుభవశాలిగా యగునట్లు శిక్షణ ఇవ్వాలె. వ్యవసాయ కళాశాల కోర్సులలో వ్యవసాయ పరిజ్ఞానము గ్రామజీవితము ఆవరించునట్లు చేయాలె. వ్యవసాయ కళాశాల గ్రామ పునర్నిర్మాణ కార్యక్రమాన్ని వ్యవసాయ విస్తరణ కార్యక్రమాన్ని తమ ప్రాంతాల్లో కొన

( తరువాయి 16వ పేజీలో )

# పల్లెటూళ్ల పునర్నిర్మాణము

శ్రీ కె. వీరమల్లయ్య

మన మాతృదేశము లక్షలాది పల్లెటూళ్లతో కూడు కొని యున్న ఒక చిన్నఖండము. భారతదేశము మొత్తము జనాభాలో 70 వంతు ప్రజలు గ్రామముల యందే నివసించుచున్నారు. మన రాజకీయములలో గ్రామ జీవిత ప్రాముఖ్యత ఎంతయో గలదు. గ్రామీణుల జీవితములు సుఖవంతములయిన నాడు మన భారతదేశము బాగుపడినదని భావించవచ్చు. వారు శారీరకంగా ఆర్థికంగా అభివృద్ధి పొందునట్లు చూచు బాధ్యత మనది. "గ్రామమే భారతదేశమునకు అంతరాత్మ వంటిది. నగరము మాతృదేశముఖముపై ఒక నుచ్చువంటిది." అని మహాత్ముడన్నాడు.

ప్రాచీన కాలములో మన గ్రామాలు సౌఖ్యవంతముగా విలసిల్లినవి. అవి స్వయంసమృద్ధములై స్వయం పరిపాలనాధికారమును గలిగియుండేవి. ప్రజల నిత్య జీవిత అవసరాలు అచ్చోటనే లభించు వస్తువులతో పూర్తి అయ్యేవి. కాని బ్రిటిషు సామ్రాజ్య తత్వము వ్యాపించడముతోనే మన పల్లెటూళ్ల స్థితి నాశనమవుటకు కారణమేర్పడెను. భారతీయులు స్వదేశ పరిశ్రమల వలన కలుగుచుండు వస్తువులను వీడి పాశ్చాత్య వస్తువులను ఉపయోగింప మొదలిడిరి. క్రమముగా పాశ్చాత్య నాగరికత నలవాటు జేసికొనిరి. గ్రామజీవిత మీ విధంగా నాశనమై ఎచ్చోట పంచాయతీ రచ్చలుండెనో, ఎచ్చోట రామాయణ మహాభారత ఉపనిషత్తుల పఠనము జరుగుచుండెనో, యచ్చట దోమలగానము, గాడిదల నృత్యములు, (సంచారము) చెలరేగెను. పాశ్చాత్య సభ్యతవలన కొన్ని నగరాలు వృద్ధి పొంద గలిగినను ఆ నగరాభివృద్ధులే గ్రామాల నాశనమునకు హేతువులయ్యెను.

ప్రస్తుతము మన గ్రామాలు ఆర్థికంగా హీన పరిస్థితిని దాల్చినవి. మన పల్లెటూళ్లకు సులభమార్గాలు (రోడ్లు) నివసించుటకు వసతైన యిండ్లు, వైద్యశాలలు పాఠశాలలు లేవు. అయినను కర్షకుడు తన జీవితాన్ని సాహసమును బూని సహనముతో గడుపుచున్నాడు. సర్వసాధారణంగా గ్రామీణులంతా కర్షకులే. కర్షకుడు ఋణముతోడనే పుట్టి ఋణముతోనే జీవించి ఋణముతోనే గిట్టుచున్నాడు. విద్యావంతులు నవనాగరికతలోనే తమ జీవితముల గడుపుదురు. కాని కర్షకులు వారికంటె కగపడరు. నగర జీవితాన్ని నవనాగరికత పద్ధతిలో ఎల్లప్పుడు గడుపగలుగుతాము అనేది వారికి ఒకటే ఆలోచన. అట్టివారు గ్రామ పునరుద్ధరణ కనువగు పద్ధతుల నవలంభించజాలరు. వారు నిజమైన భారతదేశాన్ని (గ్రామములను) మరచిపోవుచున్నారు.

పల్లెటూళ్లే భారతదేశము. మనము ఆ పల్లెటూళ్లకు బిడ్డలము. ప్రతి కొత్త పద్ధతిని అవలంభించుటలో మొదలు మన పల్లెటూళ్ల ఆర్థికస్థితిని బాగుపరచాలె. గ్రామీణులపై ఆదరాభిమానాలు కలిగియుండాలె. మరియు వారి నిత్యజీవిత వ్యవహారములను వ్యవసాయమును ప్రకృతి సంపదలతో తులదూగు పల్లెటూళ్ల వృత్తులను చేతిపనులకు కొాపాడుటకు సమయమివ్వాలె, నాటి నభివృద్ధి చేయుటకుపాటుపడాలె. జీవనోపాయ యత్నములు నేడు మన పల్లెటూళ్లలో లెక్కలేనన్ని కలవు. కష్టించి మన పల్లెటూరి ప్రజానీకాన్ని విద్యాబుద్ధులచే నలంకరింపజేసి నవీన పద్ధతిలో ప్రాచీన సంస్కృతిని రూపొందింప జేసినచో మన గ్రామ ప్రజలు సర్వవిధాల నుత్కృష్టులై నేటి కాలనాగరికతను తలదన్నె వారగుదురు. నేటి జీవితములో యంత్రశాస్త్రము వలన కలిగించిన సౌకర్యముల ద్వారా వృద్ధిపొందిన నాగరికతను మన భారతదేశ పల్లెటూళ్ల ప్రజలకునందజేయు నవకాశాలు యెన్నో కలవు. అవి శాంతము, ఓర్పు, సంతోషము చేగలుగును. ఈ గుణములు భారతీయునికి ఉగ్గుపాలతో పోయబడునవే. విద్యా వైద్య గృహనిర్మాణ మార్గనిర్మాణ వ్యవసాయిక సంబంధములగు సమస్యలు నేడు ముఖ్యముగా మన పల్లెటూళ్లలో పరిష్కరింప బడవలసి యున్నవి. వీటి నిర్వహణార్థము సహకార సంఘాల

నిర్మాణము ముఖ్యమని మన నాయకులు వాటిని లేవదీయుచున్నారు.

మహాత్ముని ఆర్థిక తత్వమేమంటే దేశములో కొన్ని నగరాలలో నున్న ముఖ్య పరిశ్రమలను వేరువేరుగా జేసి ప్రతి పల్లెటూరుకు విభజించి పంచి ఆ పరిశ్రమలను వృద్ధిజేయుట స్వయం పోషణ మరియు స్వయంసమృద్ధి కలిగించడమే ముఖ్యాతి ముఖ్యము. ఇది మహాత్ముని యుద్దేశము. గ్రామాల మధ్య వ్యాపారపు అంగళ్లు నెలకొల్పి గ్రామాలు వృద్ధియగుటకు గాను రాకపోకల సౌకర్యాలు కావలసినన్ని కల్పించవలయును. గ్రామ నిత్యజీవిత ఆహారానికి కావలసిన ధాన్యాలను వేరేచోటికి పంపక తన యూరనే కొనుగోలు చేసికోవలయును. ఆహార ధాన్యాలను బయటికి పంపించుట మానివేయవలెను. గ్రామీణులే ప్రత్తి పండించి నూలువడికి నేసిన వస్త్రములను సిద్ధపరుచుకొనవలెను.

ఆర్థికంగా గ్రామాలు బాగుపడాలంటే వాటి స్వయం పోషకత్వానికి సరిపోవునన్ని వస్త్రాలు నిత్య జీవిత వ్యవహారాలకు సంబంధించిన వస్తువులను సిద్ధపరుచుకొనవలయును. గ్రామీణుడు కూరగాయలు పశుపోషణ పాలు వెన్న నేయి మొదలగునవి ఇంకా యితర యెన్నో పరిశ్రములను వృత్తులను వృద్ధపరచుకొనుటకు సహకారసంఘములను స్థాపించుకొనవలయును. ఈ విధముగా గ్రామములకు పునరుజ్జీవనము గలిగించుటకు వ్యవసాయదారుడు కార్మికుడు కష్టజీవిగా మారి పాటుపడి కష్టము చేసిన, దేశము సకల సంపదలకు ఆటపట్టగును.

దేశాభివృద్ధికై పల్లెటూళ్ల ఉద్ధరణకై మహాత్ముడు ఎన్నో నిర్మాణాత్మక కార్యక్రమముల తలపెట్టి యభివృద్ధి సంఘాల నెలకొల్పినాడు. హరిజన సేవా సంఘము, అఖిలభారత పారిశ్రామిక సంఘము, అఖిల భారత చేనేత సంఘాలద్వారా అపారమైనసహాయము నేడు భారతావనికి కలుగుచున్నది. గురుదేవుడు స్థాపించిన విశ్వభారతి ద్వారాకూడ పల్లెటూళ్లకు తగిన సహాయము లభించుచున్నది. కస్తూరి బా స్మారక ఫండు నుండి కూడ గ్రామాభివృద్ధి సలుపబడుచున్నది.

మహాత్ముని ఈ సంఘాల నిర్మాణాత్మక కార్యక్రమములు దేశాభివృద్ధికై పల్లెటూళ్ల యుద్ధరణకై యింకా యెన్నో ప్రణాళికలు గూడ బయలుదేరినవి. ఎం. యన్. రాయ్‌గారు సిద్ధపరచిన ప్రణాళికల వంటివి, హాయిగా కూర్చొని సిద్ధపరుచుట సులభము కాని వాటిని అమలుపరుచుట మహాసంకటము కాబట్టి నేటి మన యేడు లక్షల గ్రామాలను ఉద్ధరించి అభివృద్ధి పరచాలంటే ఇప్పుడు వచ్చే యెన్నికలలో వచ్చే నాయకులే మన స్వతంత్రరాజ్యాంగము ద్వారా పరిష్కరించ గలరని ఆశించుచున్నాను.

( 14 వ పేజీ తరువాయి )

పాగించుటకు పూనుకొనాలె. అప్పైతే విద్యార్థులకు గ్రామసమస్యలతో సంబంధము యేర్పడుతుంది. ప్రాథమిక పాఠశాలలో సెకండరీ పాఠశాలలో ప్రతి విద్యార్థికి వ్యవసాయ పరిజ్ఞానముకలుగునట్లు చేయాలె. అప్పుడే వ్యవసాయముపై శ్రద్ధాసక్తు లేర్పడుతవి. విద్యావంతులగు స్త్రీ పురుషులు చెట్ల పెంపకములో వ్యవసాయ కృషిలో అనుభవము పొంది యితరులకు శిక్షణ యివ్వాలె. అప్పుడే వ్యవసాయాభివద్ధిలో అందరికి ఉత్సాహము కలుగుతుంది.'

శ్రీ కె. యం. మున్షీ గారి ఉపన్యాసానంతరము విద్యాశాఖా మంత్రి మౌలానా ఆజాదుగారు పాఠశాలలో వ్యవసాయ విద్య ప్రవేశ పెట్టేదేగాక విద్యార్థులు పొలములో పనిచేయుటకు యోగ్యులగునట్లు శిక్షణ పొందాలని తెలిపిరి- పల్లెటూళ్ల భావి ఫలమునకు శ్రీ కె. యం. మున్షీగారు వ్యవసాయ నూతన పద్ధతులను సృష్టించ గలందులకు పల్లెటూరు తమ సంతోషమును తెలుపుచున్నది.

( 13 పేజీ తరువాయి )

తన 'బెడ్డు' ప్రక్క బిక్క మొహంతో పెద్దవాడు ఆడిస్తుంటే పళ్లికిలిస్తున్నప్పుడు మల్లీ పాపాయిని చూశాడు. ఊరిబయట తోపుదగ్గర కొళ్ళసరకి ఎవరో మొత్తానికి బలంగా తలమీద కొట్టారు. తనగడ్డం కింద నుంచి తలవిూదికి పెద్ద కట్టేకట్టారు తీపుపుడుతోంది. 'ఇశ్ అబ్బా' అనుకున్నాడు గంగయ్య. ఇంతలో భార్య వచ్చి చెంచాతో పాలునోటికందించింది.

ప్రక్క 'బెడ్డు' మీద కన్ను ఆపరేషన్ చేయించుకోడానికి వచ్చి ఉన్న ఆసామికి నర్సు పేపరు చదివి చెబుతోంది - తన ఊళ్లో ఏవిధంగాను కల్లోలాలు లేకుండా శాంతి యుతంగా సక్రమ పద్ధతిలో ఎన్నికలు జరిగాయని పత్రికలో ప్రకటన పడింది.



# మెదకుజిల్లాలో రాజకీయాల చరిత్ర

రచన: శ్రీ సి. నా. రె

ఆంధ్ర పితామహ శ్రీ మాడపాటి హన్మంతరావుగారి గ్రంథాలయోద్యమానంతరము హైదరాబాదు రాష్ట్రమున తెలంగాణాలో రాజకీయాలపుట్టుక మెదకుజిల్లా జోగిపేటనుండియే ప్రారంభమైనది. 1930 మార్చి 3వ తేది ప్రథమాంధ్ర మహాసభకు జన్మదినము. తెలంగాణాకుముఖ్యనగరమగు హైద్రాబాదు నగరమున తెలుగు పత్రిక లేనికొరతను దీర్చిన శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు ప్రథమాంధ్ర మహాసభకు అధ్యక్షపీఠమలంకరించి రాజకీయబీజముల నాటిరి. మొదట ఆంధ్రమహాసభ పేరుతో నొప్పు రాజకీయోద్యమము జోగిపేట మెదకుజిల్లానుండియే కలిగినది.

హైద్రాబాదు స్వాతంత్ర్య పోరాటములో పేరుగాంచిన శ్రీ సర్దారు జమలాపురము కేశవరావుగారు 1946 మే నెల 10వ తేది కందిలో జరిగిన పదమూడవ ఆంధ్రమహాసభకు అధ్యక్షపదవి నలంకరించిరి. దైవచిత్రమేమోగాని ఈ పదమూడవ ఆంధ్రమహాసభ తుదిమహాసభగా మెదకుజిల్లాలోనే జరిగినది. ఆంధ్రమహాసభ పుట్టుట యంతరించుట మెదకుజిల్లాయందే యేర్పడినది.

1946 సం॥ పిమ్మట స్టేటుకాంగ్రెసుపై నిషేధము తొలగినది 1947వ సంవత్సరమునుండి శ్రీ స్వామిరామానందతీర్థగారి నాయకత్వముక్రింద స్వాతంత్ర్య పోరాటము ప్రారంభమైనది ఈ పోరాటమున శ్రీ స్వామీజీగారు బంధింపబడి మెదకుజిల్లా ముఖ్యస్థానమగు సంగారెడ్డి కారాగృహమున నుంచబడిరి. ఇదియు మెదకుజిల్లాలో నొక చారిత్రిక ముఖ్యవిషయమే.

గోడ్సే హంతకుని మారణాస్త్రమున మహాత్ముడు పరమాత్మ స్వరూపము దాల్చినపుడు సంగారెడ్డికి సమీపమున ప్రవహించు పవిత్రమంజీరానది తీరమున యచ్చటి ప్రజలు మహాత్ముని స్మరించి వారి యాత్మశాంతికి ప్రార్థనలు గావించిరి. ఆతీరము గాంధీఘాటను నామముచే పిలువబడుచున్నది. ప్రతిసంవత్సరము సంగారెడ్డివాసులచటికిబోయి స్నానసంధ్యాది విధులతో గాంధీదేవుని స్మరింతురు.

సుప్రసిద్ధులగు బహుభాషా కోవిదులగు కవితా విశారదులగు కీ. శే. బచ్చురామన్న గుప్తగారి కుమారులు కంది పదమూడవ ఆంధ్రమహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ బచ్చు వేంకటేశ్వర గుప్తగారి జన్మ



సురవరం ప్రతాపరెడ్డి

స్థానమగు సదాశివపేట వ్యాపారకొట్టులు రజాకారు రాక్షసత్వమున దగ్ధము గావింపబడినది. ఈ ఘోరఘట్టము మెదకుజిల్లాలోనే జరిగినది.

స్వాతంత్ర్య పోరాటమున మెదకుజిల్లా చాల కష్టించినది. హైదరాబాదు రాష్ట్రప్రజలు కాంగ్రెస్ యుద్యమములో పాల్గొన్నవారు జూపినత్యాగ ఫలితము పోలీసు చర్యకాలమున మా మెదకుజిల్లాకే దొరికినది. పెద్దాపురము మిట్టతొగరుపల్లి సమీపముననే భారతసేనకు విజయము ప్రాప్తించినది దీనికి విజయగడ్డ

యని పేరుపెట్టుటుచితమగును. సికింద్రాబాదు బొల్లారము కంటోన్మెంట్ ఉపసంహరింపబడిన పిమ్మట బ్రిటిషువారి సైన్యమీమార్గమునుండే వాపసు పిలుపించుకోబడెను హైద్రాబాదు సికింద్రాబాదు ముఖ్యనగరములకు సైనిక రాకపోకలకిదియే ఆదిత్రోవ. విజయముకు పిమ్మట నిటనుండి వచ్చిన భారత సైన్యము



[illegible] రావు

నకే సైన్యాధిపతియగు శ్రీ చౌదరిగారికి నైజాముగారు ఓటమి తెలిపి స్వాగతమొసగిరి. కావున పోలీసు చర్యకు విజయము మెదకుజిల్లానుండియే కలిగినదని సగర్వముగా నిచటివారలు చెప్పుకొనుటలో నతిశయోక్తి యుండదు.

విజయమునకు పిమ్మట హైద్రాబాదు రాష్ట్ర కాంగ్రెసు సంస్థ రెండుచీలికలుగా నేర్పడెను. ఈ చీలికలమూలముననే స్వార్థము ద్వేషము యంతట యంతట పొడచూపెను వృత్తివర్గాలలో విభేదాలు కలిగెను. అంతా అశాంతి తాండవ మాడజొచ్చెను. ఈ యశాంతి కీలలు ఢిల్లీవరకు ప్రాకిపోయెను. తుదకు నెహ్రూ పటేలుగారు హైద్రాబాదుకు రావలసి వచ్చెను. 1949 అక్టోబరులో జరిగిన కాంగ్రెసు ఎన్నికల యనంతరము, చీలికలలో గెలుపొందిన యొక పక్షమువారు, కాంగ్రెసుతత్వము గాంధీజీ సిద్ధాంతాలనే మరచిరి. రాజకీయములలో సత్యమురాణించక పోయెను. ఇందువలన పోటీసంస్థలు ముందుకు దూకెను. సుఖముగా జీవించదలచిన పల్లెటూరి ప్రజలకు కష్టములు మెండై స్వాతంత్ర్యము సన్నగిలి పారతంత్ర్యము హెచ్చెను. కూటిగుడ్డకు నలిగి ఇదే నామనరాజ్యమా అనుమాట ప్రతివానినోట వెడలజొచ్చెను. ధనికవర్గము బీదవర్గమను భేదములు పొడచూపెను. ఒకరినొకరు విమర్శించుకొనుటకు తావేర్పడెను. అభివృద్ధి నిరోధకము అవకాశవాదము ప్రబలజొచ్చెను. పల్లెటూరు ప్రజలకు ఆధారములేని పలుత్రోవలు సంప్రాప్తించెను.

నూతన రాజ్యాంగ ఎన్నికలలో ఓటువిధానము పల్లెటూరి ప్రజలకు తెలియదు. ఎన్నికలు క్రమవిధానమున జరుగవలెననే నేడు నెహ్రూ యాదేశము. పల్లెటూరివారలకు తెలియదు. అయినను పల్లెటూరు ప్రజలు నేడు తెలిసికొనుట ధర్మము. నూతన రాజ్యాంగ విధానము పల్లెటూరి ప్రజానీక ఓటుపై నాధారపడియున్నది.

---

# వైద్యసహకారము

రచన : శ్రీ చిదిరమఠము అడివయ్య

✱

పల్లెటూరిలో వైద్యసహకారము యింటింట యుద్దీపితమై యాగంతుకతత్కాలవ్యాధి నివారణకుపయోగకరముగానుండెడిది. ముడివాము, దుంపరాస్న, సొంఠి, పిప్పలి, మిరియాలు, కరక, యుసిరికతానికాయలు, మోడి ప్రతియింట చిన్నమూటలు కట్టి భద్రపరుచుకొనుచుండెడివారు. తెల్లగలిజేరు, తులసి, నల్లేరు కుక్కతులసి యవసగ మూలికలు యింటిపెరడులలోనే దొరుకుచుండెడివి. కస్తూరికిబదులు యెల్లిపాయను వాడుచుండెడివారు. వాతబద్ధహరములకు వంటాముదము. పైత్యశ్లేష్మాదులకు జుంటితేనే అల్లము, అజీర్ణాదులకు కావలసిన లవణములు తప్పనిసరిగా యుంచుకునేవారు. ఇవి సామాన్య బీదకుటుంబములలో గూడ యుండెడివి. ప్రతిపల్లెటూరిలో అనువంశిక వైద్యులు పెద్దగ్రామములలో శాస్త్రీయ వైద్యులు యుండేవారు. నేడుగూడ యున్నారు. పల్లెవాసుల వైద్యవిధానము చాలమట్టుకు చెట్లపైన ఆధారపడియున్నది.



# కష్ట - సుఖములు



[ తేఁటగీతము ]

ఒక్క కావడిలోఁ జిక్కియున్న రెండు
ఘటములీ కష్టసుఖములు, ఘటనయానెడు
శకటచక్రద్వయమునఁ గష్టమయమొకటి,
సౌఖ్యమయమితరము: బండిసాఁగినడువ
రెండుగిఱ్ఱులు తిరుగుచునుండు సతము.
కష్టసౌఖ్యాత్మకములఁ జక్రముల రెంటఁ
గష్టమునునొక్క నేమి, సౌఖ్యమునునొక్క
నేమి క్రమము దప్పకయ పొందికనుగనియె.
చక్రసంభ్రమణమున నుచ్చైర్గతమగు
నేమి దిగఁబోవ నికటస్థనేమి పైకి
వచ్చుచుండును, సౌఖ్యవిభ్రాంతి కష్ట
మందుఁ, గష్టవిభ్రాంతి సౌఖ్యంబునందుఁ
గనఁబడుచుచు, ప్రతారించుచును, ప్రదేశ
పరవశతఁగొల్పు: కావడీ వాహకమ్ము
ప్రాణిసంహతి: వాహనక్రమమునందు
వెనుకఘటమును ముందునకును, వెనుకకు
ముందుఘటమును ద్రిప్పుచుఁబోవుచుండు
వాహకుం: డట్లుత్రిప్పక వలనపడదు
బాట నడవంగ నప్పటప్పట నిజముగ;
నిట్టిమార్పును పొందుచున్నట్టి కష్ట
సుఖములం గష్టమిదియని, సుఖమిదియని
యనుభవించుచునే భేదమరయలేము;
పుట్టుచీఁకగు నిఱుపేద పొట్టఁగడుపు
కొఱకు కాల్దాఁకు తినఁగూఁడ జూడ
లేక, శీతాతపశ్రమలేక, వెల్గు,
చీఁకటులగూర్చి బిమ్మిటిలేక, ప్రొద్దు
దొట్టియూరివారంత నిద్దురనుగాంచు
రాత్రిదాఁకఁదిరుగుచు, విశ్రాంతికొఱకు
దలఁకుఁజాటుచిక్కని యవస్థలకుఁదారి,
తారు బిచ్చగాఁడు తనకుఁదప్పకుండఁ
బట్టెడన్నము పుట్టునప్పట్లఁ గష్ట
కలిత నిజజీవితమున సౌఖ్యంపుభ్రాంతిఁ
గాంచు, సర్వవిధైశ్వర్య కలితుఁడగుచు
సత్కరాద్వయ భోగ్యవిన్యస్త సౌఖ్య
విభవుఁడగుచుండి, యింకనువిత్తవృద్ధిఁ
జేయఁ, జేసినదాని రక్షింపమిగులఁ
బొందుచుండిన కష్టానుభూతియందు
సౌఖ్యవిభ్రాంతిఁగను; బరిశ్రమికుండు
మండుటెండ నాఁగిలిఁదున్నుచుండినట్టి
వేళ చెమటఁటొడలఁజల్లని గాలిసోఁక
సౌఖ్యవిభ్రాంతిఁగొను; నదేచందమునను
గృహమున నన్నడి చక్కనుయ్యెలఁబరుండి
యూఁగుసౌఖ్యానుభూతిలో నూఁగులాట
నెచ్చుతగ్గులగతి గతినేని కాంచుఁ
గష్టవిభ్రాంతి; సుఖములోఁ గలదు కష్ట,
మరయఁ గష్టంబులోన సౌఖ్యంబుగలదు;
సౌఖ్యములు వాసినంతఁ గష్టములు గలుగుఁ,
గష్టములు వాసినంత సౌఖ్యములు గలుగు:
కష్టసుఖములొండొంటితోఁ గలసియుండు,
వేఱుపడియుండు: రూపున భేదపడును,
భేద మెఱుఁగరానీయక వెలయుచుండు.

శ్రీ ఒద్దిరాజు సీతారామచంద్రరా



# భాయీ ! ఒక్క మాట



నీ లేఖ అందింది. నేనిక్కడికి చేరాక మనపల్లెనే మరిచాననీ, ఉత్తరాలు వ్రాయడమే మానుకున్నాననీ కోప్పడ్డావు. అంతటితో వూరుకోక, బస్తీకి చేరుకున్న వాళ్లందరూ అంతేననే దాకా కూడా పోయ్యావు.

అబ్బ! ఊపిరి సలపనివ్వకుండా విసిరే నీ వడిసెల దెబ్బలను ఎలా తప్పించుకోవాలో తోచదు. అయినా- ఎలాగో సంజాయిషీ చెప్పుకోకుంటే నీ ఆగ్రహం యింతటితో ఆగేట్టు కనబడదు. నా సంజాయిషీ అంతా విన్నాక బహుశా నీవు శాంతిస్తావనే నా నమ్మకం.

ఇంతకీ- నీవన్నదాంట్లో నిజంలేదని నేననుగాని, అంతా నిజంకాదనే సవరణను కలుపుకోవాలంటాను. అదేమిటంటే- నేను నీకు ఉత్తరాలు వ్రాయలేదన్నవరకు నిజమే గాని, నిన్నూ, మన పల్లెనూ మరచిపోయ్యాననడం మాత్రం తప్పు.

అయితే- ఉత్తరాలు వ్రాయలేక పోవడానికి ఒక పెద్ద ముఖ్యకారణముంది. నీవు నమ్ముతావో, లేదోగాని అది తీరికంటూ లేక పోవడం. బహుశా- నీవీ విషయాన్ని అంగీకరించవేమో గాని యిది పదహారణాలా నిజం.

ఉదయం 8 గంటల నుండి రాత్రి 8 గంటలదాకా పనిచేస్తే గాని వెళ్లని యిక్కడి పరిస్థితుల్లో ఇక తీరిక అంటూ ఎక్కడుంటుందో ఆలోచించు.

ఎప్పటి కప్పుడు యిక్కడి బాధలన్నీ నీకు విపులంగా వ్రాద్దామనుకొని కూడా సావకాశం లేక వాయిదాలు వేస్తూ పోతున్నాను. ఏంజేయను? ఇదంతా సుఖమని నీవు భ్రమ పడుతుంటే నాకు నవ్వొస్తుంది. ఇక- ఈసారి ఎలాగైనా ఈ లేఖ వ్రాయకుంటే నీవు వూరుకోవని తెలుసన్నంతవరకు గబగబా వ్రాస్తున్నాను.

నీ ఉత్తరంలో- కాస్త చదువుకున్న ప్రతివాడూ బస్తీకి చేరి పల్లెలను మరచిపోవడం అలవాటయి పోయిందంటూ, అందులో నన్నుకూడా చేర్చి ఒక విసురు విసిరావు. పైగా నన్ను వెంటనే మనపల్లెకు వచ్చెయ్యమన్నావు.

ఈ విషయంలో నాపైనీకున్న చనువును కాదనలేను. అంతేకాదు- నీతోపాటు వచ్చి నేనూ అక్కడే వుండాలనే నీసంతోషాన్నీ, ప్రేమను కూడా కాదనలేను.

కాని- సమయం వచ్చింది గనుక, యిక్కడ నీకో విషయం చెప్పక తప్పదు. అదేమిటంటే- యీ మాట నీ వెందుకంటున్నావనే ప్రశ్న. ఎందుకంటే- యీ మధ్య అనేకమంది యిదేమాట అంటున్నారులే. నా రెందుకంటున్నారో, దాని అననరా లేమిటో నాకు తెలుసు. వారి చిత్తశుద్ధిని నేను శంకించను. కాని- నాకీ విషయంలో అనేక సందేహాలున్నాయి. అవేమిటో నీకు చెప్పకుండా వుండలేను.

నేను పల్లెటూరి వాణ్ణే- నేనేమిటి? దాదాపు బస్తీల్లో వుండే అనేకమంది పల్లెటూరి వాళ్లే- నాకు మన పల్లెలంటే వల్లమాలిన ప్రేమా, చెప్పలేని ఆనందమూ వుంది. ఇవ్వన్నీ వుండికూడా నేనక్కడ ఉండడం లేదంటే కారణమేమిటో కొంచెగా గ్రహించాలి. నాకు తెలుసు- నీ విన్నీన్నీ ఆలోచించవు. పైగా- కాస్త చదువుకున్న వాడల్లా బస్తీ కెగబాకుతాడని విసురు విసురుతావు.

అవును నీవన్నది నిజమే. చదువుకున్న వాళ్లు చాలామంది బస్తీ తోవబట్టాలని చూస్తారు. కారణం- బస్తీలంటే వ్యామోహం పడికాదు: పల్లెల్లోని గొడవలకు భయపడి కాదు. ఒకే ఒక ముఖ్య కారణం- గత్యంతరం లేకపోవడమే.

ఈ మాటంటే నీకు ఆశ్చర్య మేస్తుంది కదూ! అవును. నీ కెప్పుడూ అంతే. ప్రతిదీ నీ ఆలోచన ప్రకారమే వుంటుం దనుకొని కూర్చుంటావు. కాని- కొన్ని సమయాల్లో నీ ఆలోచనలు తప్పుతాయి. అప్పుడు నీవు ఆశ్చర్యపోతావు. అయితే- యిందులో నీవు ఆశ్చర్యపడాల్సిందేమీ లేదు. ఇది- మామూలు విషయం.

చదువుకున్న వాడికి ( ఇక్కడ చదువంటే నా వుద్దేశ్యంలో కనీసం హైస్కూలు చదువు ) పల్లెల్లో

వుండి చేయగలిగిందేమీ వుండదు. నేనీ మాటనగానే వెంటనే నీవు మండిపడియిలా అంటావని నాకు తెలుసు.

పల్లెల్లో పని లేకపోవడమేమిటనీ, ఉన్న పనంతా పల్లెల్లోనే వుందనీ, అక్కడి ప్రజల అభివృద్ధికి పాటుబడాల్సి వుందనీ, గ్రంథాలయాలు మొదలైన వైజ్ఞానిక సంస్థలను నడపాలనీ యింకా యిలాగే ఎన్నెన్నో అవసరాలు చెప్పుకుంటూ పోతాం. ఇందులో నీవన్నదేదీ అబద్ధమని నేనేమాత్రం అనలేను. కాని- నేననగలిగేది ఒకటుంది. ఈ పనులన్నీ చేసేవానికి జీవనోపాధి మార్గమేమైనా వుంటుందా అని, నా ప్రశ్న.

బహుశా-నీవీప్రశ్నకు చప్పున సమాధానమివ్వలేవు. ఇచ్చే సమాధానాన్నయినా సంతృప్తికరంగా యివ్వలేవేమో! ఎందుకంటే-నాకు తెలుసు, యీ కార్యక్రమాలవల్ల బ్రదుకుదెరువు గడిచేదేమీ వుండదు. అదంతా దేశసేవలోకొస్తుంది.

దేశానికి సేవచేయడం నేనొద్దనను, ఒద్దనకపోవడమేకాదు; అలా పాటుబడుతున్న పవిత్రనాయకులకూ, కార్యకర్తలకూ నా నిండుకృతజ్ఞతలర్పిస్తాను.

కాని-అందరూ అలా చేయాలనిగానీ, చేయగలుగుతారనిగానీ నేననుకోను. ఎందుకంటే ప్రతివానికీ ముందు కడుపునిండితేనేగాని, తర్వాత ఏ సేవయినా.

అయితే-కొందరు మహనీయులు బ్రతుకుదెరువును లక్ష్యపెట్టకుండా త్యాగాలు చేసినవారు లేకపోలేదు. కాని-అందరివల్ల అది నెరవేరేదికాదు. అంతేకాదు. ప్రతివ్యక్తీ తానొక్కడిని ప్రత్యేకంగా వుండగలుగుతానని వూహించేవీలులేదు. అందులోనూ- పురుషుని విషయం మరీ దాదాపు ప్రతిమధ్యతరగతి మగవాడూ ఒక కుటుంబాన్ని పోషించక తప్పదు. తనకు దేశసేవ చేయాలనీ, త్యాగంచేయాలనీ వున్నా ఈ బంధాల నుండి అతను తప్పించుకోలేడు. అందుకోసం-తప్పనిసరిగా అతనొక బ్రదుకుదెరువును వేరుగా చూసుకోవాల్సి వస్తుంది. అది-పల్లెల్లో కరువనేది నీకు తెలియందికాదు.

అందులోనూ-అతని తల్లిదండ్రులు నానాఅవస్థలుపడి, భూములమ్మి, అప్పులుచేసి పిల్లలను చదివించే వుద్దేశం దేనికోసమంటావు? భవిష్యత్‌లో అతనేదో నాలుగురాళ్లు సంపాదించుకొని, అతను బ్రదుకుతూ, ముసలితనాన తమను కూడా బ్రదికిస్తాడనేగా?

ఏయువకుడూ ఈ బాధ్యతలను మరువలేడు. మరువలేకపోవడమేకాదు, తప్పనిసరంటున్నాను. అందుకే ఏదైనా ఉద్యోగంకోసం ప్రయత్నించడం అవి బస్తీల్లో లభించే అవకాశాలుంటాయి గనుక అక్కడికి చేరడం.

బహుశా-పైచెప్పిన కారణాలతో నీవు ఏకీభవించడానికి అంతఅభ్యంతరమేమీ వుండదనుకుంటాను. ఏమైనావుంటే తెలుపు. తిరిగి నేను కూడా మళ్ళీ ఆలోచిస్తాను.

అయితే-చదువుకున్నవాడు పల్లెలో వుండకపోవడానికిగల కారణాలు యివేకావు. మరికొన్ని కూడా చెబుతాను.

ముఖ్యంగా-ఇపుడు చదువుకున్నవాని చదువేమీ పల్లెలకు పనికొచ్చేది కాదంటే ఆశ్చర్యపడకు.

నీకు తెలుసు-పల్లెలో కావాల్సిన విజ్ఞానమేమిటో! వ్యవసాయ పోకడలు; పశువైద్యం, పైరు పెరుగుదలకు సూత్రాలూ; ప్రోనోట్లూ, కౌలుకాగితాలు వ్రాయడం, తిధి, వారనక్షత్రాలు తెలిసివుండడం; ఏపైరు ఏభూమిలో, ఎప్పుడు, ఎంతెంత పండవచ్చునో తెలియడం, పంచాంగం తిరగేసి మంచిరోజులూ, చెడ్డరోజులూ చెప్పడం: డోకరాలపద్ధతిన వడ్డీలూ; ఖరారునామాలు వ్రాయడం-ఇలాంటివి వందలాది సమస్యలున్నాయి.

కాని-ఈనాటి విద్యార్థికి పైవాటిలో సగమైనా రావని నా నమ్మకం. ఇంతెందుకూ? అతన్ని ఇది ఏ సంవత్సరమో, ఏమాసమో అడిగిచూడు-చెప్పలేస్తాడేమో! లేడు: చెప్పలేడు. ఏరైతయినా వచ్చి పైసల వెరశి, గిద్దలవెరసి లెక్కవేసిమ్మంటే నాకురాదని సిగ్గుపడ్డాడు. అంజాకా ఎందుకూ? తెలుగంకెలురాని వాళ్లు ఎందరో వున్నారంటే నమ్ము.

అతను బస్తీలో గుమాస్తాపనులు చేయడానికి చదివిన చదువుకు యివేమీ అవసరముండవు. అందుకనే-యివిరావు. అయితే పల్లెలో యివిరానివాడు ఎంత చదువుకున్నా లాభంలేదు. తిరిగి పల్లీయులకోసం అతనివన్నీ నేర్చుకోగలగడం కొంతకష్టం. కష్టంసంగతలావుంచు. తానింతగా చదివినవాడు, చదువురాని పల్లీయులదగ్గర నేర్చుకోవాలా అనే నామోషీ ఒకటి పీడించవచ్చుననుకుంటాను.

ఇంకా-ఇంతటితో పోలేదు. నిజంగా- చదువుకున్నవానికి పల్లెలో ఏమీతోచదు; పొద్దుపోదు.

ఎందుకంటే- ఆవిద్యార్థికి కనీసం దినపత్రికా, యింకా తన అభిరుచులకు సంబంధించిన యితర పత్రికలూ కావాలి. ఇవ్వన్నీ పల్లెల్లో దొరకవు.

( తరువాయి 22వ పేజీలో )





# ప్రజా రథ సారథి

బుజం విరిగిన నిజం
ప్రజారథ సారథి ననుకొంటు
కలగంటు...... కనుమూసింది
గడుంకూడా కదల్లేదు
ఈ మాట నిజం! నిజం!
త్రింశత్ కోటి హృదయాంకిత
త్రివర్ణ తేజోజ్వలిత
హిమవత్ శిఖానవకిరీటం
కల్లోలిత హిందూమహా
సముద్రోగ్ర తరంగాగ్రంపై
మోపింది లలాటం
అఖాతం
బంగాళా ఖాతం
ఉదయాద్రెత్తిన రక్తపతాకం
బింబంచేయున హృదయం
ఈ ఉదయం
శుభోదయమై
మహోదయమై
రక్తం పిండిన ఓజస్సై
ప్రజా రథోన్నత పథసూచికమై
వెలయాలంటే
నిజం కను తెరవాలి
విరిగిన బుజం సరికావాలి
నిజం విరిగిన బుజం సరిచేసే "ఇజం"
అదే గాంధీజం.

— "బాగి"

( 21వ పేజీ తరువాయి )

తానొక్కడా, యివ్వన్ని తెప్పించుకు నేతాహాతుండడు. ఉన్నా టపా సౌకర్యాలు ఎంత గొప్పగా పనిచేస్తు న్నాయో నీకు తెలుసు. సౌకర్యాలున్న చోటనైనా అసలు పత్రికలు మాయమయ్యే అవకాశాలు లేకపో లేదనేది మరిచిపోకు, కాని- మనవాడికి, దినపత్రిక చూడంది నిద్రపట్టదు. ఏం చేస్తాం మరి? అతను, బస్తీలో వున్నప్పుడు దానికలా అలవాటు పడివుం టాడు. నిజాని కదేమీ తప్పుడు అలవాటు కూడా కాదుగా.

ఇక- గ్రామస్తులతో పత్రికలోని విషయాలు ముచ్చటిస్తే అర్థంకావు. వాళ్లు చెప్పే వ్యవసాయ విషయాలు మనవాడిబుర్రకెక్కవు. ఇలావుంటాయి- ఒకరి కొకరి పరస్థితి. అలాంటప్పుడు ఆ వాతావర ణంలో అతనెలా మెలగ గలుగుతాడు?

నేనిలా వ్రాయడంవల్ల పల్లీయులను అన్యాయంగా చూస్తున్నా ననుకోకు. వాళ్లు అజ్ఞానంలో వుండడం, అన్ని విధాలా వెనుకబడి వుండడం యివ్వన్నీ నాకు ఎనలేని దుఃఖాన్ని కలిగిస్తాయి. అయితే- అది వేరు విషయం. దాని పరిష్కార మార్గం వేరు. నేనిక్కడ చెప్పేది- చదువుకున్న వాడు బస్తీకి చేరడానికి ఎం దుకు ప్రయత్నిస్తా డన్నదానికి నా దృక్పథంనుంచి సమాధానం మాత్రమే. నేనన్న దాంట్లో వాస్తవ ముంటే నమ్ము: లేదా- నా వాదనను సహేతుకంగా ఖండిస్తూ వ్రాయి. నేనేమనుకోను.

అంతేగాని- నేనసేదానికి తప్పుటర్థాలు తీసి, విద్యార్థులంతా పల్లెలకు మరలాలనే వాదనను ఖండిస్తు న్నానని ప్రచారం చేయకు.

నేననేది- చదువుకున్న వాళ్లంతా పల్లెలకు చేరితే జీవనోపాధేమిటనీ; వారిప్పటిదాకా చదివిన చదువు అక్కడెంత వినియోగ పడగలుగుతుందనీ; వీటికి సమాధానా లివ్వు.

ఇక- పల్లెలు ఎలా బాగుపడాలనే సమస్యపై నా అభిప్రాయాలు వేరుగా వున్నాయి. అవి మరెప్పు డైనా.

ఇప్పటి కింతే—

"భవదీయుడు"

# సోవియట్ కలప పరిశ్రమలో కార్మికులు

## ఎస్. వాసిల్కోవ్

విశాలమైన అడవులు గల సోవియట్ దేశం ప్రపంచంలో అత్యధిక కలప సంపద గల దేశం. ప్రపంచంలో అడవులు ఆక్రమించుకున్న మొత్తం భూభాగం 300 కోట్ల హెక్టర్లయితే ( ఒక హెక్టరు 2½ ఎకరాలు ) అందులో 110 కోట్ల హెక్టర్లు సోవియట్ దేశంలోనే వున్నాయి.

ఈ అపారమైన కలప సంపద నుపయోగించు కోవడంలో యిటీవల వరకూ మానవ శ్రమ మాత్రమే వుపయోగింప బడేది. ఈనాడు సోవియట్ దేశంలో కలప పరిశ్రమ బాగా అభివృద్ధి చెందిన పరిశ్రమ. అది కెనడా, అమెరికాలలో అభివృద్ధి పొందిన కలప పరిశ్రమలను కూడా దాటిపోయింది.

సోవియట్ దేశంలో కలప కొట్టడంలో చేతిపనికి బదులు ఆధునిక, అధిక వుత్పత్తి శక్తిగల యంత్రాలు, పరికరాలు వచ్చాయి.

సోవియట్ కలపపరిశ్రమలో యీనాడు అనేక ట్రాక్టర్లు, ట్రక్కులు, అనేక చిన్న విద్యుచ్ఛక్తి స్టేషన్లు, వేలకొద్ది విద్యుచ్ఛక్తి రంపాలు, వించ్‌లు, క్రేన్‌లు, రైలుబళ్లు, యితర యంత్రాలు, యంత్ర సాధనాలు ఉపయోగింప బడుతున్నాయి.

సోవియట్ కలప పరిశ్రమలో కొత్త సాంకేతిక సదుపాయాల నుపయోగించడానికి కొత్తరకం కలప కార్మికుడు అవసరమయ్యాడు. ఈనాడీ పరిశ్రమలో అనేకమంది విద్యుచ్ఛక్తి రంపం కోతగాళ్లూ, ఎలక్ట్రీషియన్లూ, ట్రాక్టరు డ్రైవర్లు, ట్రక్ డ్రైవర్లు, రైలు డ్రైవర్లు, క్రేన్ ఆపరేటర్లు, తయారయారు.

ఒకప్పుడు చెట్లు కొట్టడానికి అత్యధిక మానవశ్రమ కావలసి వచ్చింది. ఈనాడు విద్యుచ్ఛక్తి రంపాలతో కలప కోయడం, చెట్లు నరకడం జరుగుతూంది. ఒక మనిషి నడపగల సోవియట్ విద్యుచ్ఛక్తి రంపం విదేశాలలో యిటువంటి రంపా లన్నిటిలోకీ అత్యుత్తమమైంది.

సోవియట్ కలప పరిశ్రమలో ప్రత్యేకమైన సోవియట్ K. T. 12 ట్రాక్టర్లు ప్రపంచంలో మొదటిసారి ప్రవేశించేయి. ఈ ట్రాక్టర్లవల్ల కలప కొయ్యడం, విసరడం యాంత్రికమైంది. ట్రాక్టర్లూ, ఎలెక్ట్రిక్ వించ్‌లూ వచ్చి కష్టమైన పనులన్నిటిలోనూ పశువులను తొలగించేయి.

ఈ నాడు కలప రవాణాచేసే రైలుమార్గాలు, మోటారు, ట్రాక్టరు రోడ్లూ, సోవియట్ అడవులలో వేలకొద్ది మైళ్లు వ్యాపించి వున్నాయి. అవి ప్రతి ఏడాదీ ఎక్కువవుతున్నాయి.

కలప పరిశ్రమ కార్మికు లీనాడు కలప కోతయంత్రాల ఆపరేటర్లుగా తర్ఫీదు పొందుతున్నారు. ఈ కొత్త వృత్తులు నేర్చుకోవడానికి అనేక సాంకేతిక విద్యా కేంద్రాలూ, పాఠశాలలూ వున్నాయి. కార్మికులకు యీ శిక్షణ ఉచితంగా లభిస్తుంది ; దానికయే ఖర్చులన్నీ ప్రభుత్వమే భరిస్తుంది.

యాంత్రికమైన తన శ్రమతో సోవియట్ కలప పరిశ్రమ కార్మికుడు మంచి ఆదాయం సంపాదిస్తూ, నిత్యం తన జీవన ప్రమాణాన్ని వృద్ధి చేసుకుంటూ వుంటాడు. కలప కోసే పనికి సోవియట్ దేశంలో చాల అధిక వేతనం లభిస్తుంది. కొన్ని ఉదాహరణలు చూడండి ; కిరోవ్ ప్రాంతంలో గల ఆముట్నిన్స్కీ కలప కోతపరిశ్రమలో పనిచేసే, వి. కుజోవ్‌లెవ్ అనే ట్రాక్టరు డ్రైవరు యీ ఏడాది జూలైలో 3,500 రూబుళ్లకు పైగా ఆర్జించేడు ; ఒలోగ్డా ప్రాంతంలో షోరిన్‌స్కీ కలప కోత పారిశ్రామిక కేంద్రంలో ఐ. షోరిన్ అనే ట్రాక్టరు డ్రైవరు ఆ నెలలోనే 3,467 రూబుళ్లు ఆర్జించేడు. ఇటువంటి ఉదాహరణ లెన్నైనా యివ్వవచ్చును. కలప పరిశ్రమలో ఏ పని చేసినా అధిక వేతనం లభిస్తుంది.

గతఏడాదికలపపారిశ్రామిక కార్మికులకువేతనాలు హెచ్చింప బడ్డాయి ; తత్ఫలితంగా కార్మికుల వేతనాలు నూటికి 45 నుండి 80 వంతులు పెరిగాయి.

సోవియట్ కలప పారిశ్రామిక కార్మికుల జీవన పరిస్థితుల్లో ప్రధానమైన కొన్ని మార్పులు చేయబడ్డాయి. ఈ కార్మికులకై ఇళ్లు నిర్మించడానికీ, సాంస్కృతిక, పౌర సంస్థల నిర్మాణానికీ ప్రభుత్వం అత్యధి

(తరువాయి 24 వ పేజీలో)

# అత్తపత్తిచెట్టు

మఱియు దీనిని ముడుగుదామర- సోకుడుముడుగు- అనికూడా నసెదరు—

ఇది భూమిని అంటుకొని వ్యాపించును- దీనిఆకులు తుమ్మ ఆకులం బోలియుండును- పువ్వులుచిన్నవియు- ఎఱ్ఱని వర్ణము గలవిగా నుండును- ఈ చెట్టు పండ్రెండు మాసముల యందే మాసమున నైనను దొరకును- దీని యాకు నొకదానిని మనము అంటుకొనినచో దగ్గరనున్న యాకులన్నియు వెంటనే ముడుచుకొని పోవును- ఆకులకు దగ్గరగా అగ్గిపుల్లను వెలిగించినచో కొమ్మగూడా ముడుచుకొని పోవును- చెట్లకు కూడా మనవలెనే సుఖదుఃఖంబులు గలవని సూచించుట కిది యొక దృష్టాంతముగా నున్నది.

## ( దీనియొక్క గుణము )

శీతలము- కఫము- పిత్తము - రక్తపిత్తము- అతిసారము- యోనిరోగము- దాహము- వాపు- శ్వాసశ్రమ-వ్రణము- కుష్టు-రక్తవికారము- మూలవ్యాధి- అతి మూత్రము- భగంధరముల పోగొట్టును. మేహశాంతియు వీర్యవృద్ధియు గలుగజేయును—

## ( ప్రయోగ విధులు )

౧. దీని సమూలము యొక్క పొడిచూర్ణమును ఆవుపాలతో సేవించిన మేహశాంతి. పైత్యము- నశించును- ఇంద్రియ నష్టము కట్టును. వీర్యవృద్ధి కలుగజేయును—

౨. పచ్చియాకులను నూరి కట్టిన బృహత్తు (బుడ్డ) హరించును- గడ్డలకు కట్టినచో కఱిగిపోవును- వ్రణములకు కట్టిన కుళ్లు పట్టనివ్వదు—

3. ఆకు నూరి ఆ పసరు పూశినచో భగంధరము మానిపోవును—

౪. దీనియాకుల చూర్ణము మూడుమాసముల రొత్తు పాలలో కలిపి త్రాగుటచేత-మూలవ్యాధియు, బహుమూత్ర వ్యాధియు నిర్మూలించును —

౫. దీనివేరును నీళ్లతో అరుగదీసి అయిదారుసారులు లేపనం బొనరించిన నాడీ వ్రణము (నారపుండు) నయమగును—

౬. దీని వేరుయొక్క కషాయము ఉదయసాయంత్రముల యందు పుచ్చుకొనిన ప్రదర రోగము- ( స్త్రీల తెల్లబట్ట అయ్యే రోగము) నశించును—

౭. దీని యాకు పసరుతో దూది తడిపి- ఆ దూది గాయమూపడిన సందులలో పెట్టిన గాయములు మానును—

౮. ఆదివారమున దీనివేరు తెచ్చి పిల్లల మెడకు గట్టిన దగ్గులు దరిజేరవు—

౯. అత్తపత్తి-(పిల్లి పీత్స చర) అల్లిపువ్వులు (గూడపాల) వీటిని నలగగొట్టి కషాయము గాచి గాని పాలలో చేర్చి గాని పానము చేయించిన-స్త్రీ మూడు నెలల గర్భవిచ్ఛిత్తు మానును—

౧౦. దీని వేరు మంచి తిథి నక్షత్రముల యందు మంత్రసహితముగా తెచ్చి తాయిత్తునందమర్చి- మొలకు కట్టుకొనిన స్వప్న స్ఖలితము నయమగును—

౧౧. దీనియొక్క వేరు సమూలమును చూర్ణముచేసి జలముతో ఒకవారము పుచ్చుకొనిన- జ్వరమును- రెండువారములు పుచ్చుకొనిన అర్శరోగము ( మూలశంఖవ్యాధి ) మూడువారములు పుచ్చుకొనిన కుష్టు మరియు ఉపదంశము ( కొరుకువ్యాధి ) తప్పక నిర్మూలించును.—

---

(23 వ పేజీ తరువాయి)

కంగా డబ్బు ఖర్చు పెడుతూంది. కారెల్లో ఫిన్నిష్ రిపబ్లిక్‌లో గల పయిస్కీ కలప పారిశ్రామిక కేంద్రంలో పనిచేస్తున్న ఎన్. బాలిన్, ఐ. కొలాబోవ్ అనే యిద్దరు కార్మికులు చెప్పిన కథనం వింటే కలప కార్మిక జీవిత పరిస్థితులు మనకు కొంచెం అర్థమవుతాయి. వారిలా చెప్పేరు ; "విప్లవానికి ముందు కలప కార్మికులు మట్టి గుడిశల్లోనూ, గుడారాల్లోనూ నివసించే వారు. వారు పని చెయ్యడానికి మైళ్లకొద్ది దూరం నడిచి వెళ్లేవారు ; తమ భోజనాలను మూటలు కట్టుకుని వీపులమీద వేసుకుని వెళ్లేవారు. కాని ఈనాడు పరిస్థితి దీనికి పూర్తిగా విభిన్నమైనది. మేము అడవీ ప్రాంతంలో సౌకర్యవంతమైన గృహాల్లో నివసిస్తున్నాము. మాకొక పాఠశాల, క్లబ్బు గ్రంథాలయం,సినీమా, రేడియో మొదలైనవివున్నాయి. రాత్రుళ్లు మా పేటలు విద్యుద్దీపాలతో కలకలలాడుతూ వుంటాయి. ఇక్కడి దుకాణాల్లో ఏది కావాలంటే అది కొనుక్కోవచ్చును. మా కేంటీన్లు మేము పనిచేసేచోటికి భోజనాలు తెచ్చిఅందిస్తాయి. మేము అడవుల్లో పనికి నడిచి వెళ్లము. ప్రత్యేక రైలు బోగీలుగల రైళ్లలో వెళ్తాము."

సోవియట్ దేశంలో అన్నిచోట్లా కలప కార్మికుల పేటలు యిలాగే వుంటాయి. అవి మనకి సోవియట్ దేశంలో ప్రతి కలప పారిశ్రామిక కేంద్రంలోనూ కనిపిస్తాయి.

# సహకారము - సమాజ నిర్మాణము

రచన: శ్రీ ఎస్. ఎన్. మూర్తి

( గ్రామాభివృద్ధినిలయం ప్రథమసంచాలకుడు; పటన్‌చెరువు )



ఆహార సమస్యా సత్వర పరిష్కారానికై, కావల్సిన ధాన్య సేకరణకై తేనేమి; లేమనింగు విధానాన్ని బలపరచి సక్రిమ పంపిణీకై తేనేమి, నిరుద్యోగులకు ఉద్యోగము, వృత్తి, కల్పించడానికై తేనేమి; తదితర విషయాలలో వృత్తిలేక ఉన్నవారికి పనికల్పించి, వారిలో సహకార సూత్రాల వ్యాప్తికి, తద్వారా నైతిక సామాజిక వ్యవస్థను విపులీకరించవల్సిన ఆవశ్యకత ఎంతేని నేడుమన దేశంలో ఉంది.

కాని దురదృష్ట వశాత్తు సహకార సంఘాలు మన దేశంలో పాశ్చాత్య దేశాలలో వలే అభివృద్ధి కరంగా లేవు. దానికి కారణం అధిక సంఖ్యాకులైన ప్రజలు విద్యావిహీనులవడం. ప్రస్తుతంపనిచేసే సహకార సంఘాలు ఉత్సాహపూరితములై కార్యనిర్వహణము చేయక పోవడం; సక్రమమైన నాయకత్వం లభించక పోవడం; సహకార సంఘాల అభివృద్ధికి నిరోధకాలను కల్పిస్తున్న వనడం సత్యదూరంకాదు. అయితే ఇప్పుడు మనంఒకస్థాయికి వచ్చాము; స్వాతంత్ర్యోపార్జన జరిగిన తరువాత మనలో ఈ నిరుత్సాహముండ కూడదు. అధికారులు, అనధికారులు, రాజకీయవేత్తలు, అందరూకలసి మానవుని ఆర్థిక సామాజిక జీవితాన్ని పెంపొందించేందుకు సర్వతోముఖంగా కృషిచేయాలి. సహకార సంఘాలు కేవలం "అప్పులిచ్చు సొసైటీలలో" ధాన్యబ్యాంకులలోనే సంతృప్తి చెందక సమాజ పునర్నిర్మాణానికి, సామాజిక జీవితాన్ని పెంపొందించడానికి, ప్రతివ్యక్తికీ బాధ్యత ఉత్సాహం కల్పించడానికి కృషి చేయాలి.

పాశ్చాత్య దేశాలలో సహకార సంఘాలు కేవలం ఆర్థిక పునర్నిర్మాణం జరపడంలోనే సంతృప్తి చెందడంలేదు. అవి మానవుల సామాజిక, సాంఘిక, విద్యావిషయికవిషయాలనుకూడా అభివృద్ధికరంగాచేస్తున్నవి.

ఇంగ్లాండులోని సహకార సంస్థలు తమ మూలధనంనుండి, గ్రంథాలయాలను, వైద్యశాలలను, బీదవిద్యార్థులకు ఉపకార వేతనములను; గృహవసతులను నిర్మిస్తున్నాయి. చిన్న చిన్న పట్టణములలో నివసించే కార్మికులకు, క్లబ్బులు; వ్యాయామశాలలు, మొదలగు వినోద క్రీడా ప్రదర్శనాలయాలను స్థాపించి పరస్పర సహకారాన్ని అభివృద్ధి చేస్తున్నాయి. అంతేకాకుండా ఇలాంటి సమాజ నిర్మాణ కృషికే ప్రతియేటా 30 లక్షల రూపాయిలను ఈ సంస్థలు ఖర్చు పెడతున్నవనే విషయం మిక్కిలి ఆనందదాయకమైనది.

అమెరికాలో కూడా ఇదేవిధమైన కృషి జరుగుతోన్నది. అమెరికా సహకార సంఘా లు ఎక్కువగా తమ మూలధనాన్ని గ్రామా లలోని వైద్య సౌకర్యాలకు, టూరింగు గ్రంథాలయాలకు వెచ్చిస్తున్నవి. అమెరికా లోని సహకార సంస్థలను చూచిన ఒక ప్ర ముఖుడు "ప్రథమంగా సేవను చేసి తరువా త లాభాలను అందిస్తూన్న"వని చెప్పాడు.

బెల్జియంలోని సహకార సంస్థలు; సంస్థ లలో పనిచేసేవ్యక్తులకు పెన్షన్ విధానాన్ని ఎక్కువ శ్రద్ధతో ఆమోదిస్తూన్నవి. వ్యాధి గ్రస్తులైన వారికి, జీవనోపాధిని సంపాదించు కోలేని వికలాంగులకు ఉచితముగా రొట్టెను, మందులను పంపకం చేసేవిధానం అతిజాగ్ర త్తగా అమలులో పెట్టబడుచున్నది. అంతే కాకుండా నిరాధారులైన స్త్రీలప్రసవ ఖర్చు లు; దిక్కులేని వారికి దహన సంస్కార ఖర్చులు; సహకార సంస్థలపైపునుండి సినిమా హాలులను నిర్మించి మానవులను సమీకరి స్తూన్నది. అంతేకాకుండా బెల్జియంలోని సహకార సంస్థలకే ఒక మహాదర్శములై ఉన్నవనడం ఆశ్చర్యమైన విషయంకాదు.

డానిష్ సహకార సంస్థలు; తాము గడిం చిన లాభాలను మెంబర్లకు కాని వ్యక్తులకు గాని పంచిఇవ్వవు. అట్టిలాభాలను అందరి మంచికి వినియోగించే విషయాలపై ఖర్చు పెడుతాయి. విద్యాభివృద్ధి గ్రామాభివృద్ధి, వైద్యాభివృద్ధి ముఖ్యముగా పేర్కొన దగిన ప్రణాళిక లోనివి.

పాశ్చాత్య దేశాలలో జరుగుతూన్న ఈ సహకార సంఘాల కార్యక్రమం మనకు మన ప్రభుత్వానికి మార్గదర్శి. సహకార సంస్థలు మానవ జీవితంలోని ప్రతివిషయానికి సంబం ధించినవి. వీటి విలువను ప్రజలు, ప్రభుత్వ పువ్యక్తులు గమనించకపోవడం విచారకరం. పరస్పర సహకారంతోనిర్మించ బడే సంస్థ సంఘము. సంఘానికి ప్రాణప్రతిష్టను పోసే సంస్థ సహకారసంస్థ. "వ్యక్తిసంఘముకొరకు సంఘము వ్యక్తికొరకు" అనునది సహకార ప్రథమసూత్రము.

పైన ఉదాహరించిన ఉదాహరణ లన్నిం టిని చూచినయెడల మన దేశంలోని సహ కారసంస్థలు చాలా ఎక్కువ పని చేయ వలసినబాధ్యత, అవసరముకలదని మనమూ హించగలం. వీటిననుసరించి మన దేశం లో కూడా అభివృద్ధికరమైన మార్పులు ఇప్పుడిప్పుడే జరుగుతున్నవి. మద్రాస్ రిజి స్ట్రార్ గారు; 1271 గ్రామాలకుఅవసరాల నిమిత్తమై ఇనుము ఎరువులు మొదలగు నవి 188 లక్షల ద్రవ్యమును వెచ్చించి గ్రామాలకు సరఫరాచేసామనితమసంవత్సర నివేదికలో ప్రకటించారు. ఇందులో కొన్ని సంఘాలు; వ్యవసాయుపనిముట్లు; ఎరువులు, పాలు, మొదలుగునవి సరసమైన ధరలకు రైతులకు అందించేవి.

సహకార సంస్థలలో ప్ర ధా నం గా ఇప్పుడు అవసరములైనవి "బహుళ ప్రయో జనసహకార సంస్థలు"- Multi Purposl Co-Operative Societies,-స హ కా ర సంస్థలలో పనిచేయువ్యక్తులకు ప్రప్రథమం గా తన సంఘంమీద ప్రత్యేక అభిమానం ఉండాలి. గ్రామాలలోని రైతులు త మ పంటలను సంఘాలకుకాకుండా చీకటిధరల్లో అమ్ముకుంటున్నారు. దానికికారణం లేక పోలేదు. సహకారసంస్థలుబహుళప్రయోజన సహకార సంస్థలైనప్పుడు ఈ చీకటి బజారు

తగ్గిపోగలదని నావిశ్వాసం - అయితే ఈ బహుళ ప్రయోజన సహకార సంస్థనుగురించి తెలుసుకోవడం అవసరం.

ఏవిధంగానైతే గ్రామపంచాయితీ; సాంఘిక, రాజకీయ; అధికార వ్యవస్థలకు సంబంధించి వర్తిస్తుందో అదేవిధంగా బహుళ ప్రయోజన సహకార సంస్థ; సాంఘిక సామాజిక వ్యవస్థకు మార్గదర్శి-బహుళ ప్రయోజన సహకార సంస్థ ముఖ్యంగా ఈ క్రింది విషయాలను నిర్వహిస్తుంది.

1. గ్రామోత్పత్తిని, వసూలుచేసి, భద్రపరచడం.
2. గ్రామంలోని ఆహారవస్తువుల సమీకరణ.
3. ఉత్పత్తిని సక్రమంగా గ్రామస్థుల అవసరాల ననుసరించి విభజించడం
4. గ్రామస్థులకు అవసరమైన వ్యవసాయ పనిముట్లను సంపాదించి; వారి వృత్తికి ఆటంకం కలుగకుండా ఇవ్వడం.
5. కుటీర పరిశ్రమకై - ముడిపదార్థాలను స్టోరుచేసి పంచుట-ఉదా: పత్తి-ఉన్ని -
6. గ్రామాల్లో తయారుకాబడిన వస్తువుల విక్రయము.
7. గ్రామాలకు అవసరమైన వస్తువులను; గ్రామములో తయారైన వస్తువులనిచ్చి అదులుబదులుగా వస్తుసమీకరణ.
8. సహకారసంఘాలు, గల్లాగోదాములు, అప్పులిచ్చు సొసైటీలను సక్రమపద్ధతుల లోనడిపి లాభాలను సమిష్టిగా గ్రామముపై వెచ్చించుట.
9. ఉత్తమతరగతికి చెందిన విద్యావంతులతో గ్రామ కుటీర పరిశ్రమ చేయువారికి శిక్షణ నిప్పించుట.

ఈరకమైన బహుళప్రయోజన సహకార సంస్థలు 1947 నుండి యు.పి., సి.పి. లలో పని చేయుచునేయున్నవి. ఈ సంస్థల ప్రధానోద్దేశ్యం గ్రామస్థులకు కావల్సిన కనీస, ప్రాథమిక అవసరాలను నెరవేర్చటం-యు.పి. లోని బహుళ ప్రయోజన సహకారసంస్థలు; వ్యవసాయపరిశ్రమలో, రాట్నపరిశ్రమలో; బట్టలునేయుటలో అధికఆసక్తిని చూపుతూ పరిశ్రమిస్తున్నవి. ప్రతి 20 గ్రామాలకు ఒక సీడ్‌స్టోరును స్థాపించి; వ్యవసాయస్థులకు చేయూతనిస్తూ ఎరువులు; ఇనుము; చరఖాలను పంచుతూన్నవి, యు.పి. సంస్థలు. అంతేకాకండా గత రెండుసంవత్సరాలలో 909 బ్లాకులను స్థాపించింది. అందులో 14,000 గ్రామాలుచేరినై. అంతేకాకండా ప్రతిశతి 80మంది సహకారసంస్థలతో సంబంధములేని గ్రామాలలో ఈ సంస్థలు బ్లాకులనునెలకొల్పలేదు. గతసంవత్సరపు నివేదికలో రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా, "ఈ సంస్థలు పురోగమిస్తూ అధిక సంఖ్యాకులకు సహకరిస్తూ, ఆర్థికంగా సమాజాన్ని బలపరుస్తున్నవని ప్రకటించింది."

బహుళప్రయోజన సహకారసంస్థలు మానవుని ప్రతి అత్యవసరమైనసమస్యను, పరిష్కరిస్తూ, సామాజిక, నైతిక, సాంఘిక, వ్యవస్థను బలపరచాలి. అంటే మనసంస్థలు పాశ్చాత్య సహకారసంస్థలను ఆదర్శంగా తీసుకోవాలి. చీకటికోణాలలాంటి గ్రామాలలో నివసించే రైతులకు మధ్యతరగతి ప్రజలకు; విద్య, వైద్యసౌకర్యాలను కలిగించాలి. సిలోన్‌ద్వీపంలో ఇలాంటిసంస్థలు గత 14సంవత్సరాలనుండి కృషిచేస్తూ అమోఘమైనపనులను నిర్వర్తించాయి. బహుళప్రయోజన సహకారసంస్థల నిర్మాణంలో మానవులకు,

( తరువాయి 28వ పేజీలో )

# గ్రామచావిడి - రచ్చ కట్ట ముచ్చట్లు

కాంగ్రెసుపార్టీకి మూడుమూడుపార్టీలు పోటీగానిలిచినవని పత్రికలుపలుకుచున్నవి. ఎన్నికల ప్రచారము మెదకు జిల్లాలో ప్రారంభిపబడినది. కాంగ్రెసు నాయకులు పర్యటనజేస్తు ఎన్నికలవిషయము ప్రజలకు బోధిస్తు యున్నారు. త్యాగముజేసి స్వరాజ్యమును సంపాదించిన కాంగ్రెసును బలపరచండి అని బోధస్తు యున్నారు.

భూమ్యాదాయ విద్యాశాఖ మంత్రులు, సిద్దిపేట తాలూకా కొన్ని గ్రామములలో పర్యటన జేస్తు వయోజన ఓటుహక్కు పై తమ యిష్టము వచ్చిన ప్రభుత్వాన్ని ఏర్పరుచుకునేఅవకాశము లభించిన అదృష్టశాలులు ఈతరంవారని, అన్నారు. ప్రజాస్వామ్యమంటే ఎవరి ఇష్టము వచ్చినట్లు వారుచేయుటము కాదు; ఉత్తములగుఅభ్యర్థులను ప్రజలు ఎన్నుకొనడము ముఖ్యఅవసరము. కాంగ్రెసు దృఢమైనసంస్థ. కాంగ్రెసులో స్వార్థపరులు అవినీతిపరులు ఉంటే ఉండవచ్చును. కాని సముదాయకంగా సంస్థనుగూర్చి ఆలోచిస్తే కాంగ్రెసు నేడు ప్రజలను దేశాన్ని ముందుకు తీసుకపోగలదు. సోషలిస్టు కమ్యూనిస్టు పార్టీలలో గల విభేదాలను తేడాలను వివరించారు. ఒక ధనికుని బంగ్లా కాల్చడి సర్వనాశనం చేస్తే బీదవాని కడుపు ఎలా నిండుతుందో నాకు అర్థంకావడము లేదు. కాంగ్రెసు ఆదర్శాలే ఉత్తమమైనవని తెలిపారు.

హైద్రాబాదు రాష్ట్ర ప్రధాన మంత్రి ఎం. కె. వెల్లోడి మెదకు జిల్లా పర్యటన మూడు రోజులు గావించినారు. వీరు గ్రామాలలో గూడ పర్యటించి శాంతిభద్రతల పరిస్థితులను తెలుసుకున్నారు. పొలాలను పంటల పరిస్థితిని ప్రభుత్వ కార్యాలయాలను తనఖీ చేసినారు.

సంగారెడ్డి గ్రామములో మెదకుజిల్లా కలెక్టరుగారి అధ్యక్షతన 29 వ అంతర్జాతీయ సహకార సంఘ దినోత్సవము వైభవంగా జరుపబడినది. పల్లెటూళ్ల సహకారులు సుమారు 400 మంది పాల్గొనియుండిరి. సహకార సంఘ సిద్ధాంతానుసారము చిన్నపెద్ద యను తారతమ్యము లేక ఒక చోట విందారగించినారు.

---

( 27వ పేజీ తరువాయి )

సహకారసంఘాలకు అవినాభావసంబంధం ఏర్పడి; సహకారసంస్థ మిక్కిలి ప్రయోజనకారియైన ప్రభుత్వాంగంగా పరిగణింపబడుతూ న్నది. ఈవిధమైనసంస్థలు గ్రామస్థుల హృదయాలలో శాశ్వతప్రేమను నెలకొల్పి, నైతికవిజ్ఞానాన్ని ప్రసాదించగలవు.



# ఎన్నికలు - ఓటు

ఏర్పడనున్న నూతన రాజ్యాంగమునకు ఎన్నికలు ప్రారంభము కానున్నవి. ప్రజల కష్టసుఖములు తెలిసికొంటు సేవచేస్తామని ప్రభుత్వమును సాగిస్తామని శాసనసభలకు,ఢిల్లీపార్లమెంటుకు ప్రాతినిధ్యము వహించగల సమర్థులకే మీ వోటును ఇవ్వాలె. మీవోటును ఇచ్చునపుడు మీకిష్టమున్న వారికి బాగా తెలుసుకొని వోటును ఇవ్వాలె. చదువురాని వానికి చిన్నపిల్లనికి మతిచెడనవానికి నీతివిడిచి తప్పుడుపనులు చేస్తుండే వానికి నేరములుచేసి శిక్షలుపొందిన వానికి మీరు వోటు ఇవ్వకూడదు. ఆమూర్ఖుడు శాసనసభలో పెత్తనాలు చేస్తే మీరు బాగుపడరు; రాజ్యము బాగుపడదు. మీరు మంచివారికి వోటుయిస్తేమీరూ బాగుపడుదురు. మీపిల్లలు బాగుపడుదురు. యావత్తు ప్రజలు మనదేశము అంతా బాగుపడగలదు. మీవోటులో అంతసత్తాయున్నది. మీ వోటువిలువ మీరు తెలుసుకోవాలె. మూర్ఖునకు వోటుయిస్తే తాను ఉపయోగము చేసుకోడు. ఇది మీరు బాగా తెలిసికుంటే లోకము బాగుపడగలదు.

ప్రతిపల్లెలో ఓటర్లజాబితా సిద్ధముచేసి అచ్చువేసియుంతురు. మీఊరిలో యెవరిపేరైనా జాబితాకు ఎక్కకుంటే ఎన్నికలకు సంబంధించిన యధికారికి తెలిపి ఆజాబితాను సవరణ చేసికోవలెను. వోటుయిస్తే యేమి, యివ్వకుంటేయేమి అనుకోగూడదు. మీరుతప్పక జాబితాను చూచుకోనాలె. పొరపడితే వోటు హక్కు పోగొట్టుకొందురు.

మన హైదాబాదు రాష్ట్రమున మొత్తము 8876 గ్రామాలు తెలంగాణజిల్లాలలో యున్నవి. డిసెంబరు 21వ తేదీనుండి ఎన్నికలు ప్రారంభము కాగలవు. జనవరి 15వ తేదీవరకు ఎన్నికలు సాగుతునే యుండును. తెలంగాణాలో మొత్తము 74 నియోజకవర్గాలున్నవి. మన తెలంగాణాలో ఎన్నికలు ఈదిగువ తెలుపబడిన ప్రకారము జరుగును. మీరు బాగాచదివి గమనించుకోవాలె.

### 1951 డిశంబరు 21 తేది

హైద్రాబాదు, సికింద్రాబాద్, ఇబ్రాహింపట్ణము, నాగరకర్నూలు,అలంపూరు,గద్వాల,సిర్పూర్ సిద్ధిపేట,మేడ్పల్లి, హనుమకొండ, వరంగలు, ఇప్పగూడ జనగామ.

### 24 తేది డిశంబరు

మేడిచల్, కొల్లాపురము, రాజగోపాలుపేట, జగిత్యాల,హసనుపర్తి,వర్ధన్నపేట, ఆలేరు, భువనగిరి ఆసిఫాబాద, ఆర్మూర్.

### 27వ తేది డిశంబరు

షాబాదు, వనపర్తి, లక్షట్టిపేట, డిచ్పల్లి, సిరిసిల్ల, మహబూబాబాద్, రామన్నపేట.

### 31 తేది డిశంబరు

మహబూబ్‌నగరం, నిర్మలు, ఎల్లందల్, పాకాల, చిన్నకోడూరు.

### 3వ తేది జనవరి

కల్వకుర్తి, ఆదిలాబాదు, బోధను, మెదకు, నస్తులాపూర్, ములుగు, నల్లగొండ.

### 7వ తేది జనవరి

షాదునగరు,నర్సాపూరు, హుజూరాబాదు,ఇల్లెందు దేవరకొండ.

### 10 వ తేది జనవరి

పరిగి,కొడంగలు,జహీరాబాద్,కామారెడ్డి, ఆందోలు,సుల్తానాబాద,పెద్దపల్లి,వేమునూరు,పెద్దమునగాల.

### 15 వ తేది జనవరి

మక్తల్, ఆత్మకూరు, తాండూరు, వికారాబాద్, పరాకాల, మధిర, హుజూరాబాద్, మంథని, ఖమ్మం సూర్యాపేట.

ఎన్నికలుజరుగునపుడు పోలింగుబూతులలో వోటు ఇచ్చుఅధికారము స్త్రీలకు గూడ కలదు. 18 సంవత్సరములనుండి ఏర్పడిన వయసుగలవారందరు వోటు ఇచ్చుటకు హక్కుగలవారలని నిర్ణయవిధానము గావింపబడినది. పల్లెటూళ్ళు బాగుపడుటకు పల్లెటూరివారి జీవితమును గుర్తెరిగిన అనుభవముగల విద్యావేత్తలు నూతన రాజ్యాంగ శాసనసభకు అర్హులని ఓటు ఇవ్వవలెను.



